నెహ్రూ బాల పుస్తకాలయం

# మన సైన్యం

రచన

మేజర్ జనరల్ డి.కె. పాలిత్

అనువాదం

వెలగా వెంకటప్పయ్య



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# మన సైన్యం

భారతీయ సైన్యం ఇటీవల పోరాడిన యుద్ధంలో నేను ఈ కథను ప్రారంభించి చెప్తాను.

అది 1971 డిసెంబరు 16వ తేదీ. పంజాబ్-పాకిస్తాన్ సరిహద్దులో వున్న బసంతర్ నది ఒడ్డున హోషియార్‌సింగ్, అరుణ్ క్షేత్రపాల్ అనే ఇద్దరు యువభారతీయులు పోరాడుతున్నారు. వారు పోరాడుతున్న మొదటి పెద్ద యుద్ధం అదే. గ్రెనేడియర్ రెజిమెంటుకు చెందిన హోషియార్‌సింగ్ తన పదాతి దళంతో పశ్చిమ పఠాన్ కోటలోని



మిలిటరీ పోలీసు దళం

పాగ్గోవల్ గ్రామంవద్ద పాకిస్తాన్ ఎ రు_డిని తిప్పికొట్టడానికి పోరాడుతున్నాడు. అప్పటికే అతని మోకాలు శతఘ్ని కాల్పుల రవ్వలతో గాయపడింది. అయినా తనను ఆసుపత్రికి తీసుకువెళ్ళడానికి అతను ఒప్పుకోలేదు. ఎంతో బాధ ఉన్నప్పటికీ, ముమ్మరమైన శత్రువు కాల్పుల మధ్య, తన మనుష్యులకు ధైర్యం చెపుతూ, ఒక కందకం నుంచి మరో కందకానికి పాకుతూ వెళ్ళాడు.

ఉదయం సగం గడిచే సరికి శత్రువు ఒత్తిడి పెరిగింది. పరిస్థితి మరింత తీవ్రం అయింది. పాకిస్తానీయులు మరిన్ని ద డులు జరిపారు. వారికి అండగా భారీ శతఘ్ని దళాలు ఉన్నాయి. అప్పుడు యుద్ధం ఒక క్లిష్టదశకు చేరుకుంది. ఫలితం ఊగిసలాటలో పడింది. కృతనిశ్చయంతో కూడిన ఒక వ్యక్తి చర్య మాత్రమే సమస్యను తేల్చగలదు. సరిగ్గా హోషియార్‌సింగ్ నిర్వహించిన పాత్ర ఇదే. గాయపడినప్పటికీ ఆయన నాయకత్వం, సాహసం-ఇవే ఆనాటి బసంతర్ యుద్ధంలో పదే పదే సాగిన శత్రుదాడులను నిలుపరించిన కీలక కారణాలు.



మేజర్ హోషియార్ సింగ్



అరుణ్ ఖేత్రపాల్

హోషియార్‌సింగ్ అలా కందకాలలో కొనసాగుతుండగానే ఆయన వున్న స్థానానికి కొంచెం ఉత్తర దిశగా, పదాతి సైన్యానికి సహాయం చేసేందుకు పూనాహార్స్‌కి చెందిన టాంకుల దళం దూసుకువచ్చింది. కొత్తగా సైన్యంలో చేరిన అరుణ్‌ఖేత్రపాల్ అనే యువ టాంక్ కమాండర్ యుద్ధంలో శత్రువుల టాంకులను ఎదుర్కోవడంలో నిమగ్నుడయ్యాడు. వాళ్ళ టాంకులు రెండు, మూడిటిని ధ్వంసం చేశాడు. తర్వాత సాగిన యుద్ధంలో తీవ్రమైన కాల్పులు జరిగాయి; ఇంతలో అతని సొంత టాంకు దెబ్బ తిన్నది. ఇంజనుకు నిప్పు అంటుకుందని అతను గ్రహించాడు. పేలిపోవడానికి ముందే ఆ టాంకును వదిలివేయమని పై అధికారి అతనికి సలహా ఇచ్చాడు; కాని అది యుద్ధంలో నిర్ణయాత్మక క్షణం. టాంక్‌లోనే ఉండిపోయి పోరు సాగించాలని అరుణ్ నిశ్చయించుకున్నాడు. తన శిరస్సు గాయపడేవరకు శత్రు టాంకుల మీద కాల్పులు జరుపుతూనే వున్నాడు. అప్పుడు మాత్రమే యుద్ధం నుంచి టాంకును బయటకు నడపమని డ్రైవరుకు చెప్పాడు. కానీ అప్పటికే ఆలస్యమైపోయింది; టాంకు పేలిపోయింది. గాయపడిన అరుణ్ లోపలే కాలి చనిపోయాడు.

బసంతర్ వద్ద ఆరోజు పాకిస్తాన్ దాడిని ఓడించటానికి ఈ యిద్దరు యువకుల నిస్వార్థ చర్య నిర్ణయాత్మకంగా తోడ్పడింది.

యుద్ధంలో ప్రతి సైనికుడు తన కర్తవ్యాన్ని నెరవేర్చాలని ఆశించడం జరుగుతుంది; కాని కొన్ని సమయాలలో అది చాలదు. ఎందుకంటే, కొన్ని క్లిష్టసమయాలలో యుద్ధకెరటాన్ని మళ్ళించడానికి కర్తవ్యం పిలుపునకు మించి సాహసం, త్యాగం అవసరమవుతాయి. గతంలోని భారతదేశ యుద్ధాలలో అనేకమంది మాదిరిగానే-హోషియార్, అరుణ్‌ఖేత్రపాల్ ఈ కర్తవ్య దీక్షని ప్రదర్శించారు. ఈ యిద్దరు యువకుల సాహసానికి భారతదేశ అత్యున్నత గౌరవం-పరమవీరచక్ర - బహూకరించారు. దురదృష్టవశాత్తు, అరుణ్‌కు మరణానంతర అవార్డు లభించింది.

సాధారణ వ్యక్తుల్ని అకస్మాత్తుగా కథానాయకులుగా, తీవ్రప్రమాదాలు ఎదుర్కొనేవారుగా ప్రాణాలు పణంపెట్టే వారుగా చేస్తున్న దేమిటి? అది దేశభక్తి కావచ్చు, మంచి

క్రమశిక్షణ, ఉన్నత నైతిక బలం ఈ విషయంలో చాలా తోడ్పడుతాయి. కానీ, దీనికి జవాబు భారదేశ సైనిక సంప్రదాయంలో కూడా ఇమిడివుంది. భారత దేశానికి చాలా సుదీర్ఘమైన విశిష్టమైన సైనిక చరిత్ర వుంది. ఇతర దేశాలు యుద్ధ పరిభాష, నియమాలు రూపొందించుకోవడానికన్నా చాలాముందే భారతీయ యోధులు, రాజులు, వారి సైనిక దళాల ప్రవర్తనకు మార్గదర్శకంగా ఉచితమైన, వీరోచితమైన సైనిక నియమాలు కలిగి వున్నారు.

పురాణాల నాటి సైన్యానికి, ఈనాటి సైన్యానికి ఎంతో తేడా ఉన్నప్పటికి వాటి ఉత్తేజం, వీరత్వం ఆ ప్రాచీన సంప్రదాయాలనుంచి ఏదో ఒక మేరకు పొందుతూనే వున్నాం. అందువల్ల నేనిప్పుడు భారతదేశ సైనిక సంప్రదాయాల గురించి, నేటి భారతీయ సైన్యం ఎలా నిర్మితమైందో, ఇప్పటి రూపంలోకి ఎలా అభివృద్ధి చెందిందో కొంచెం చెపుతాను.

# ఎలా ప్రారంభమైంది?

భారత సైన్యాల 'సోదర భావం' నిర్మించడానికి చాలా చాలా కాలం పట్టింది. తమ దేశ చరిత్ర సరిగ్గా తెలియని కొందరు భారతీయ సైన్యం స్వభావం, సంప్రదాయం పూర్తిగా బ్రిటిష్‌కే రుణపడి వుంటాయని కొన్ని సందర్భాలలో ఊహించారు. ఆధునిక భారత సైన్యాన్ని ముందుండి నడిపించి, నిర్మించింది బ్రిటిష్‌వారే అయినప్పటికీ, భారతీయ సైనిక సంప్రదాయం అంతకన్నా వెనక్కి వెళుతుంది. అది కొన్ని వేల సంవత్సరాల వెనక్కి, రామాయణం, మహాభారతాల వంటి పురాణాల లోకంలోకి వెళుతుంది. అప్పటికి ప్రపంచంలో సూత్రబద్ధమైన సైనిక వ్యవస్థ, ఖచ్చితమైన సైనిక నియమావళి కలిగివున్నది ఒక్క భారతదేశం మాత్రమే. ఈనాడు భారతీయ సైనికుడు తానుగా సాధించుకున్న కీర్తి మన పూర్వీకుల సైన్యాలు నెలకొల్పిన సంప్రదాయాలకు మరింత రుణపడి వుంటుంది.

లిఖిత చరిత్రలో వీరగాథల కాలానికి, భారత దేశంపై ఇస్లామీ దండయాత్ర తొలి సంవత్సరాలకూ మధ్య చాలా అంతరం వుంది. ఈమధ్యకాలంలో గ్రీకులు భద్రపరచిన పత్రాల ద్వారా మనకు ఖచ్చితంగా తెలిసిన ఒకే ఒక యుద్ధం భారత దేశంపై అలెగ్జాండర్ చక్రవర్తి జరిపిన దండయాత్ర. అది రెండు వేల సంవత్సరాల క్రితం జరిగింది. వారి నుంచి మనం భారత సైన్యం, ఏనుగులను, రథాలను ఉపయోగించిందనీ, భారతీయరాజు పురు (పురుషోత్తముడు), అతని అనుచరులు హైడాస్పెస్ (జలంధర్‌వద్ద) యుద్ధంలో మహోన్నత ధైర్యం ప్రదర్శించారని తెలుసుకున్నాం. భారతీయ రాజు యుద్ధంలో ఓడిపోయినప్పటికీ శక్తివంతమూ, వీరోచితమూ అయిన అతని ప్రతిఘటన అలెగ్జాండర్ భారత దేశం నుంచి వెనక్కివెళ్ళేలా చేయడంలో విజయవంతం అయింది. భారతీయ యోధులు

గ్రీక్ చక్రవర్తిని ఎంతగానో ప్రభావితం చేసినట్లు చెప్పబడింది.

చంద్రగుప్త చక్రవర్తి కాలంలో మౌర్య సైన్యం ఇప్పటి పాకిస్తాన్‌గా వున్న గాంధార, ఆఫ్ఘనిస్తాన్, హేరాత్, తుర్కాన్ తీర ప్రాంతాన్ని గ్రీకులనుంచి తిరిగి జయిం



అలెగ్జాండర్ చక్రవర్తి

ంచింది. బాగా నిర్మాణయుతంగావున్న మౌర్యుల సైన్యం అలెగ్జాండర్ వారసుడైన సెల్యూకస్‌కు బాధాకరమైన ఓటమిని విధించింది. ఈ విజయాలు ప్రధానంగా ప్రాచీన యుద్ధ నియమావళి భారత దేశంలో ఇంకా అనుసరించబడం జరుగుతోందన్న వాస్తవానికి ఋణపడి వుంటాయి. దీనికితోడు మౌర్య సైన్యం పాతకాలపు రథాలవంటి సాధన సంపత్తిని విడిచిపెట్టి, ప్రధానంగా అశ్విక, గజ, పదాతి దళాలను కలిగివుండి. వ్యక్తిగత రక్షణ కవచాలు అభివృద్ధి చెందాయి: తేలికైన విల్లు వాడకంలోకి వచ్చింది. యావత్తు బలగం పురు మహారాజు నాటికంటే మరింత చలనశక్తి కలిగివుంది.

మౌర్య సామ్రాజ్యం విచ్ఛిన్నమైన తర్వాత భారతదేశం అనేక చిన్న చిన్న రాజ్యాలుగా చీలిపోయింది: సైనిక శాస్త్రంలో ఎలాటి పురోగతీ లేదు. ఈ చిన్న రాజ్యాలు పశ్చిమం నుంచి వచ్చిన ముస్లిం దండయాత్రికులకు తేలికగా ఆహారమయ్యాయి. 1526లో బాబరు జరిపిన మొఘల్ దండయాత్రలా భారతీయ ఆయుధాల ఆధునికీకరణలో విశిష్టమైన ప్రాముఖ్యతగల ముందడుగు వేయడం.

ఆధునిక ఆయుధాలలో అత్యంత ప్రధానమైన పాత్ర శతఘ్నులదని మీకు తెలుసు. తుపాకులు శత్రువులను చాలా దూరం నుంచి కాల్చగలవు. అప్పటి నుంచి, పాత తరహా యుద్ధ విధానమైన బాహా-బాహీ పోరాటానికి శత్రువును సమీపించకుండానే అవి శత్రువులను చంపగలుగుతున్నాయి. బాబర్ దండయాత్ర నాటికి భారతీయులకు శతఘ్నులు లేవు. ఆ ఆయుధాన్ని బాబరే భారత దేశానికి తీసుకు వచ్చాడు.

ప్రసిద్ధమైన పానిపట్టు యుద్ధంలో బాబర్ తన సైన్యాన్ని చాలా తెలివిగా నిల బెట్టాడు. ఒకదాని కొకటి పలుపు తాళ్ళతో కట్టిన ఎద్దుబళ్ళను ఒక వరుసగా నిలిపాడు. ఈ మార్గావరోధానికి వెనుకగా శతఘ్ని దళాన్ని వుంచాడు. దానికి రెండు వైపులా అతని అశ్విక దళం వుంది. ఇబ్రహీంలోడీ నాయకత్వాన వున్న భారతీయ సైన్యాలు పాత సామూహిక యుద్ధతంత్రం ప్రకారం పోరాడేందుకు దగ్గరకు వెళ్ళాలని ప్రయత్నించాయి. కానీ మొఘలు శతఘ్ని దళం దూరంనుంచి కాల్పులు జరిపి వారిని వేలసంఖ్యలో పడ గొట్టింది. ఈ ఊహించని దాడితో భారత బలగం గందరగోళ పడుతుండగానే బాబర్

తన అశ్విక దళాన్ని పక్కలనుంచి నడిపించాడు. వాళ్ళు గుర్రాల్ని పూర్తి వేగంతో పరుగెత్తిస్తూ భారతీయుల మీద దాడి చేసి, అనేకమందిని నరికి చంపి మిగిలిన వారిని పారిపోయేలా చేశారు.



పానిపట్టు యుద్ధంలో బాబర్ సైనిక పథకం

మొఘల్ సామ్రాజ్యానికి విజయవంతమైన దశ అప్పుడు ప్రారంభం అయింది. కాలక్రమంలో అది నిజమైన 'భారతీయ' సామ్రాజ్యం అయింది. మహా చక్రవర్తులైన హుమాయూన్, అక్బరుల పాలనలో భారత సైన్యాలు బాగా నిర్మాణయుతంగానూ, మరింత సామర్థ్యంగలవిగానూ, ప్రత్యేకించి రాజపుత్రులు, మరాఠాలు వంటి యుద్ధయోధుల సంప్రదాయాలలో ఉత్తమమైన వాటినన్నిటినీ ఇముడ్చుకున్నవిగానూ రూపొందాయి.

# మరాఠా, శిఖు సైన్యాలు

మరాఠాలు ఒక కొత్త యుద్ధతంత్ర రూపాన్ని ప్రవేశపెట్టినందువల్ల మొఘలుల మీద అనేక విజయాలను సాధించారు. "గెరిల్లా యుద్ధతంత్రం" గురించి మీరు వినే వుంటారు: అది ఇప్పుడు చాలా మామూలు పదం అయిపోయింది. ద్వితీయ ప్రపంచ యుద్ధంలో కొన్ని గెరిల్లా చర్యలు జరిగాయి. వియత్నాంలో ఈ యుద్ధతంత్ర రూపాన్ని వియత్‌కాంగ్ (వియత్నాం విమోచన సైన్యం) ఆచరించింది. ఇంకా అనేక ఇతర ఉదాహరణలు వున్నాయి. శత్రువు వున్నంత బలంగా నువ్వు లేనప్పుడు, తగినస్థాయిలో తుపాకులు, టాంకులు లేనప్పుడు "గెరిల్లా యుద్ధతంత్రాన్ని" వినియోగించడం జరుగుతుంది. ప్రత్యక్ష పోరాటంలో ఆధిక్యతగల శత్రు బలగాలను నువ్వు ఎదిరించలేవు: అప్పుడు నీవు చేయగలిగిందల్లా చీకటి మాటున అకస్మాత్తుగా వారిమీదకు వెళ్ళడం: రక్షణ లేకుండా పట్టుకుని దాడి చేయడం: శత్రువు బలాన్ని, జనాన్ని కూడదీసుకుని నీ మీద దాడిచేసేలోపు అడవి లేదా పర్వతాలలోకి త్వరితంగా వెళ్ళి మాయమవటం. తమకన్నా మరింత శక్తివంతమైన, మంచి సాధనసంపత్తిగల సైన్యాలను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు, ప్రత్యేకించి ఆసియాలోని పేద దేశాలకు ఈనాటి ప్రసిద్ధమైన యుద్ధతంత్ర రూపమిది.

ఉపఖండంలో ఈ యుద్ధతంత్ర రూపాన్ని అనుసరించిన ప్రముఖులలో "విప్లవ వీరుడు" అని పిలువబడే మరాఠాకు చెందిన శివాజీ భాన్స్లే ఒకడు. ఎందుకంటే, ఢిల్లీలోని మొఘల్ చక్రవర్తి బ్రహ్మాండమైన సైన్యాలకు అతను సరితూగాడు. అతను దక్కను పర్వత శ్రేణులమధ్య అనేక సైనిక కోటలను నిర్మించాడు: అక్కడినుంచి అతని బంది పోటు దండ్లు ఎప్పుడు ఎలాంటి అవకాశం లభించినా మొఘల్ సేనా విభాగాల మీదకు ఉరికి

దాడిచేసేవి; అతి వేగవంతమైన మెరుపు దాడి; మళ్ళీ పర్వతాలలోకి వెళ్ళి కనుమరుగయ్యే వారు. అతను మొఘల్ పాలనా నిర్వహణకు అనేక సంవత్సరాలపాటు ప్రమాదకారి అయ్యాడు. అదే సమయంలో శివాజీ పాత హైందవ సైనిక నియమావళిని ఖచ్చితంగా పాటించే వాడు. తమ సొంత ప్రయోజనాల కోసం కొల్లగొట్టేందుకు సైనికులను అనుమతించ లేదు. ఒక దళాధిపతి అయినా సరే, చేజిక్కిన సంపదనంతా రాజ్యానికి అప్పగించాలి. స్త్రీలను పిల్లలను ఖైదీలుగా తీసుకురావడాన్ని అనుమతించలేదు.


శివాజీ

మధ్య యుగాల నాటి భారత సైన్యాలకు, ఆధునిక భారతీయ సైన్యానికి మరొక ప్రధానమైన అనుసంధానం శిఖ్ఖు సైనిక బలగాల వల్ల రూపొందింది.

శిఖ్ఖు యుద్ధ వాదానికి పితృపాదుడైన గురుగోవిందసింగ్ తన పతాకం కింద చేరిన ప్రజానీకంలో ఉదాత్తత, ఐక్యత భావాలను కలిగించిన వారిలో ప్రథముడు. వారే తర్వాత ఖాల్సాదళ్‌గా రూపొందారు. వేర్వేరు కులాలు, జాతులన్నిటి మధ్య-వారు అల్పకులస్తులయినా సరే-సోదర భావం అనేది ఈ వ్యవస్థలోని గణనీయ అంశం. వీరే శిఖ్ఖు సైనిక

వ్యవస్థను రూపొందిం చారు. మధ్య దోబ్‌కు చెందినజాట్లు శిఖుసైన్య ప్రసారం అయ్యారు. కానీ పర్వత ప్రాంతాల గూర్ఖాలు, ముస్లిములు, ఇంకా ఇతరులు వివిధ శిఖు మిస్ల్‌లలో చేరడా నికి స్వేచ్ఛ వుంది. సైనిక సంప్రదాయం, పరాక్రమం అనేవి ఏ ఒక్క జాతి, వర్గం, లేదా కులాలకు చెందిన విశేషాధికారం కాదని భారత దేశంలో మొదటి సారిగా వారు నిరూపిం చారు.



గురు గోవింద సింగ్

ఈ ప్రజాతంత్ర సైనిక యంత్రాంగాన్ని క్రమబద్ధం చేసి, యూరపు సైన్యాల పద్ధతిలో సన్నద్ధం చేయడం ద్వారా ఆధునికం చేసే కర్తవ్యం మహారాజా రంజిత్‌సింగ్‌కి అప్పగించారు. ఆయన తన బలగాలకు ఆధునిక పద్ధతులలో శిక్షణ ఇచ్చి, పునర్నిర్మిం చేరిదుకు బ్రిటిష్, ఇటలీ, ఫ్రెంచి అధికారులను నియమించాడు. ఖాల్సా శతఘ్ని దళం శక్తివంతమైన ఆధునిక సైన్యం అయింది. లాహోర్ కోటలో కార్ఖానాలు నెలకొల్పారు. ప్రపంచంలో వేటికీ, ఏ విధంగానూ తీసిపోని తుపాకులు అక్కడ పోతపోశారు.



శత్రువుపై దాడి చేస్తున్న సైన్యం



మహారాజా రంజిత్ సింగ్ ఒక పాత రేఖా చిత్రం

ఈ సైన్యమే ఉత్తర భారత దేశంలో బ్రిటిష్ ప్రాసాదాన్ని గడగడలాడించింది. అయినప్పటికీ రంజిత్‌సింగ్ మరణానంతరం సిక్కు సైనిక రాజ్యాన్ని సమర్థవంతంగా నిర్వహించగల కేంద్రనాయకుడు లేకపోవడంతో, బ్రిటిష్ పదే పదే జరిపిన దాడుల్లో అది క్రమేణా ఛిన్నాభిన్నమైంది.

# బ్రిటిష్ సామ్రాజ్యం కోసరం పోరాటం

నేనిప్పుడు ఈ దృశ్యాన్ని 1914 నాటి శీతాకాలపు యూరపు ఖండానికి, ఉత్తర ఫ్రాన్స్‌లోని యుద్ధరంగం మీదికి మళ్ళిస్తాను. అప్పటికి కొద్ది నెలల క్రితమే ఆ దేశం మీద జర్మనీ దాడి జరిపింది. బ్రిటిష్ ఫ్రెంచికి సహాయం చేయడానికి వచ్చింది. కాని రెండు దేశాల్నీ జర్మనీ వెనక్కి, దాదాపు పారిస్ గేట్ల వరకు నెట్టివేసింది. బ్రిటిష్, ఫ్రెంచ్‌లను ఆదుకోవడానికి భారత దేశంలాంటి సుదూర దేశాల నుంచి కూడా దళాలను పంపడం జరిగింది.

ఒక నౌకనిండా వున్న భారతీయ సైనికులు మార్సెల్లెస్ చేరుకున్నారు. వాళ్ళను వెంటనే యుద్ధశ్రేణికి పంపారు. ఆ ఏడాది శీతాకాలం త్వరగా ప్రవేశించింది. భయంకరమైన చలి. పరిస్థితుల్ని మరింత విషమింపచేయడానికా అన్నట్లు భారతీయ సైనికులు ఉష్ణప్రాంత వస్త్రాలు-ఖాకీ చొక్కా, నిక్కరు-ధరించి వున్నారు. మొదటి కొద్ది వారాలు భారతీయులకు సరైన ఆహారం లభించలేదు. ఎందువల్లనంటే, బ్రిటిష్ ఫ్రెంచి వారి సాధారణ రేషన్‌లలో పంది మాంసం, గొడ్డు మాంసం ఉంటుంది. వారు తమ సొంత రేషన్లు వచ్చేవరకు రొట్టె, బంగాళదుంపలతో సరిపెట్టుకోవలసి వచ్చింది.

చలితో వణకుతూ, సరైన తిండి లేకుండావున్న భారతీయ సైనిక బెటాలియన్లను తిన్నగా మొదటి వరుస కందకాలలోకి, జర్మన్ శతఘ్ని దళం నిరంతరం కాల్పులు జరుపుతున్న చోటికి పంపారు. ఆధునిక ఆయుధాలతో వున్న యూరోపియన్ దళాలకు వ్యతిరేకంగా పోరాడటం భారతీయులకు ఇదే మొదటిసారి. వ్యతిరేక పరిస్థితుల కారణంగా భారతీయ సైనికులు యుద్ధంలో సరిగ్గా వ్యవహరించలేరని అనేకమంది భావించారు.

అప్పుడు జర్మన్లమీద దాడిచేసే మొట్టమొదటి అవకాశం వారికి వచ్చింది. భారతీ యులు రణభేరి మోగించారు. కందకాల వరుసలలోంచి కందిరీగల్లా లేచారు. రైఫిల్-సన్నీలతో శత్రువువైపు దూసుకు పోయారు. భీకరమైన హాహా హాహీ ఘర్షణలో జర్మన్లు నిదానంగా వెనక్కి తగ్గారు. రెండు రోజుల పోరాటం ముగిసే సరికి భారతీయ సైన్య విభాగం జర్మన్ల యుద్ధ పరికరాల్ని సరికొన్నింటిని స్వాధీనం చేసుకుంది. జర్మన్ పురోగమనాన్ని నిలువరించటంలో ఈ విజయాలు ఒక ప్రధాన కారణమయ్యాయి.

సేనా నాయకుడు తనకు తానుగా సైనికులను అభినందించటానికి బెటాలియన్ దగ్గరకు వచ్చాడు. ఆయన భారతీయుల దాడిని "ఈ యుద్ధంలో తాను ఇంతవరకు చూడని ఉత్తమ ఆయుధ విన్యాసం"గా వర్ణించి భారతీయబెటాలియన్‌ను శాశ్వతంగా తనడివిజన్‌లో ఉండమని అడిగాడు. చివరికి భారతీయ సైన్యం తన స్వస్థానానికి వచ్చేసింది.

మొఘలుల కాలం నుంచి భారతదేశ బలగాలు బ్రహ్మాండమైన పురోగతిని సాధించాయి. ఎందుచేతనంటే భారతీయ సైన్యాన్ని రూపొందించి, పునర్నిర్మించింది మనకు తెలుసు. వారు భారత దేశాన్ని వలసగా మార్చటం ఆరంభించిన తర్వాత, భారతీయ ప్రజలకు సైనిక నిపుణతను సుసంపన్నమైన సంప్రదాయాలు వున్నాయని గుర్తించారు. అందువల్ల వారు పూర్తిగా యూరోపు దళాల మీద ఆధారపడటానికి బదులుగా భారతదేశంలో స్థానిక బలగాలను కూర్చుకోనారంభించారు. పదిహేడవ శతాబ్ది ప్రాంతంలో నిదానంగా, పెద్ద భారతీయ బలగం మూడు ప్రెసిడెన్సీలలో. బెంగాల్, బొంబాయి, మద్రాసులలో — నిర్మితమైంది. తర్వాత వాళ్ళందరినీ ఒకే భారతీయ సైన్యంగా కలిపివేశారు. ఈ సంవత్సరాలలో భారతీయ సైన్యంలోని కొన్ని విభాగాలను అనేక విదేశాలకు — చైనా, ఆఫ్ఘనిస్తాన్, పర్షియా ఈజిప్టు, ఇండోనేషియా, బర్మాలకు-పోరాడేందుకు పంపించారు.

మన బలగాలు భాగస్వామ్యం వహించిన నిజమైన భారీ యుద్ధం1914-18 నాటి ప్రపంచ యుద్ధం..ఇప్పటికే నేను దీని గురించి కొంత వరకు చెప్పాను. ఈ యుద్ధ కాలంలో భారతీయ దళాలకు జర్మన్‌వలసవాద సైన్యాలతో పోరాడేందుకు తూర్పు ఆఫ్రికాకు, టురుష్కులతో పోరాడేందుకు అరేబియాకు కూడా పంపించారు. ఆ విధంగా భారతీయ సైనికుల పరాక్రమం ప్రపంచంలోని అన్ని దేశాల దృష్టికి వచ్చింది. తమ పోరాట లక్షణాలకు ఉన్నత ఖ్యాతిని వాటికి



పర్వతాలపై కాపలా కాస్తున్న సైనికుడు

వారే అర్థించుకున్నారు.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం 26 సంవత్సరాల కాలం శాంతి నెలకొని వుంది కాని, మన భారతీయ సైన్యం సైనిక సరిహద్దులలోని పఠాన్ లకు వ్యతిరేకంగా పోరాటంలో నిమగ్నమైంది. ఈ ప్రాంతంలోని అఫ్రిదీలు, మొహమ్మండ్లు, వజీరీల వంటి గిరిజనులు నానా తిరుగుబాటుదార్లు. వారు ఆఫ్ఘనిస్తాన్ను భారతదేశం నుంచి వేరుపరచే పొడుగాటి పర్వత గుహలలో వుండేవారు. వారెన్నడూ పూర్తిగా బ్రిటిష్ పాలనకు లొంగి వుండలేదు. ఖైబర్ కనుమకు ఎదురుగా వున్న పర్వతాలపై ఎన్నో యుద్ధాలు జరిగాయి. కాని అవన్నీ భారతీయ సైన్యం దృఢంగా, అప్రమత్తంగా వుండేందుకు సహకరించాయి.

# ద్వితీయ ప్రపంచ యుద్ధం, స్వాతంత్ర్యం

1939లో ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ఫ్రాన్స్, ఇంగ్లండ్‌లు ఒక పక్షాన, హిట్లర్ జర్మనీ, ముస్సోలినీ ఇటలీ ఒక పక్షాన వున్నాయి. త్వరలోనే అమెరికా, రష్యా, ఇంకా అనేక ప్రజాతంత్ర దేశాలు బ్రిటిష్ పక్షాన, జపాన్ జర్మనీల పక్షాన చేరాయి. భారతీయ సైన్యం బ్రిటిష్ వారి కోసమే పోరాడింది.

భారతీయ సైన్యంలో మొదటి రెండు డివిజన్లు ఉత్తర ఆఫ్రికాలో జర్మన్లు, ఇటాలియన్లకు వ్యతిరేకంగా పోరాడేందుకు విదేశాలకు వెళ్ళాయి. వాళ్ళు బాగా పోరాడినందున భారతీయ సైన్యం యావత్తు ప్రపంచమంతటా ప్రఖ్యాతి పొందింది. అనేక 'విక్టోరియా క్రాస్'లను మనవాళ్ళు గెలుచుకున్నారు. భారతీయ ఇంజనీర్లలోని యువకుడైన రెండవ లెఫ్టినెంట్ ప్రేమేంద్రసింగ్ భగత్ విక్టోరియా క్రాస్ గెలుచుకున్న భారతీయ అధికార్లలో ప్రథముడు. తర్వాత అతను జనరల్ అయ్యాడు. కాల్పుల మధ్య మందు పాతరలను తొలగిస్తున్నందుకు అతనికి విక్టోరియా క్రాస్ బహూకరించారు. ఒక పాతర పేలి అతను గాయపడగా ఆసుపత్రికి పంపించినప్పటికీ గాయాలు ఇంకా మానకుండానే ఆసుపత్రిని విడిచిపెట్టి, తన సొంతభద్రతను పట్టించుకోకుండా ప్రమాదకరమైన కర్తవ్యాన్ని కొనసాగించాడు. 'నేను చూసిన వాటిలోకెల్లా కేవలం మొండి ధైర్యంతో సాగించిన సుదీర్ఘ ప్రయాసం అది' అని. అతని కమాండింగ్ ఆఫీసర్ ఒక అధికార నివేదికలో రాశాడు.

మీరెప్పుడైనా సెలవులకు లేదా చదువులకు ఇటలీ వెళ్ళినట్లయితే కాసినోలోని అంతర్జాతీయ యుద్ధ సమాధుల స్మారక స్థూపాన్ని తప్పక చూడండి. సుందర ఆరామాలు

వున్న మాంటెకాసినోవద్ద ఒక ప్రసిద్ధ యుద్ధం జరిగింది. ఆ పోరాటంలో నాలుగవ డివిజన్ నాయక పాత్ర వహించింది. ఈనాడు కాసినో అంతర్జాతీయ యాత్రాస్థలమైంది. అక్కడ విశాలమైన ఒక పవిత్ర మందిరంలో ఇటలీ యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన వేలాది మిత్రదేశాలలో సైనికుల్ని గౌరవ భావంతో సంస్మరిస్తారు. వాటిలో ఇటలీలో పోరాడి, ఒరిగిన అనేకమంది భారతీయ అధికారులు, సైనికుల సమాధులున్నాయి. నాజీ జర్మనీ ఆధిపత్యం నుంచి తమ దేశాన్ని విముక్తం చేయడంలో భారతీయ యువకుల త్యాగాన్ని ఇటలీ దేశస్థులు కృతజ్ఞతా భావంతో సంస్మరిస్తారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలంలో జపాన్‌కు వ్యతిరేకంగా బర్మాలో జరిగిన యుద్ధంలో భారతీయ సైన్యం అత్యంత కీలకపాత్ర వహించింది. ప్రపంచంలో అత్యంత ధైర్యవంతులైన వారిలో జపాన్ దేశస్థులొకరు. వాళ్ళు బ్రిటిష్‌ని, అమెరికాని, డచ్‌ని ఓడించి, మలయా, ఇండోనేషియా, ఫిలిప్పైన్స్, బర్మాలలోని వారి వలస స్థావరాలను ఆక్రమించారు. ఆ తర్వాత భారత దేశంపై దాడి చేశారు. అది బ్రిటిష్ ఇండియాకి కాళరాత్రి. దేశ భవిష్యత్తు తూనికలో ఊగిసలాడుతోంది.

ఈ పోరాటం అంతా నాగాలాండ్, మణిపూర్, అరకాన్స్, చింద్విన్‌లోయ సరిహద్దు వద్దగల చిత్తడి అడవులలో, పర్వతాలలో జరిగింది. అటవీ యుద్ధంలో శిక్షణ పొందిన జపానీయులు మొట్టమొదట మన దళాలకు దీటైనవారని నిరూపించుకున్నారు. వాళ్ళు మన దళాల్ని మణిపూర్, ఉత్తర అస్సాంలవైపు వెనక్కినెట్టివేశారు. అయినప్పటికీ భారతీయులే అత్యధిక సంఖ్యాకులుగా వున్న దళాలుగల పద్నాలుగవ సైన్యం క్రమంగా అటవీ యుద్ధంలో ప్రావీణ్యం సంపాదించి, అనేక భీకర పోరాటాల తర్వాత జపానీయులను వెనక్కి తరిమి వేయడం ప్రారంభించింది.

ఈ పోరాటాలలో మొట్టమొదటి సారిగా యుద్ధంలోని ఒక బ్రిగేడుకు భారతీయ అధికారి కె.ఎస్. తిమ్మయ్య నాయకత్వం వహించారు. బ్రిగేడ్‌లోని మొత్తం మూడు బటాలియన్లకు భారతీయులే కమాండర్లు కావటం కూడా ఇదే ప్రథమం. ఆ రోజుల్లో సీనియర్ అధికారులు ఎక్కువమంది బ్రిటిష్‌వాళ్ళే అయినప్పటికీ క్రమంగా ఉన్నత

శ్రేణులలో భారతీయులకు స్థానం కల్పించటం ప్రారంభం అయింది. అనేక సంవత్సరాల తర్వాత జనరల్ తిమ్మయ్య భారతీయ సైన్యాధిపతి అయ్యారు.



పోరాటానికి సిద్ధంగా ఉన్న ట్యాంక్‌లు

1948లో కాశ్మీరులోని యుద్ధ ప్రాంతాన్ని సందర్శిస్తున్న జనరల్ రాజేంద్రసింగ్ (కుడి), జనరల్ కె.ఎస్. తిమ్మయ్య (ఎడమ).

# స్వాతంత్ర్యం

కొంతకాలం తర్వాత జపానీయులు బర్మాలో లొంగిపోయారు. ద్వితీయ ప్రపంచ యుద్ధం ముగిసింది. అప్పుడు భారతదేశానికి స్వాతంత్ర్యం రావడం, దేశ విభజన జరిగింది.

పాత భారతీయ సైన్యం విభజితమైంది. పాత సైన్యంలో మూడింట ఒక వంతు పాకిస్తాన్‌కు, మిగిలిన రెండువంతులు మనకు చెందింది. ఇది మార్పులు, అస్థిరతల కాలం; ఎందువల్లనంటే బ్రిటిష్ జనరల్స్, సీనియర్ అధికార్లు అందరూ ఒక్కసారిగా భారతదేశాన్ని విడిచి వెళ్ళారు. సైన్యాధిపతి నుంచి కిందివరకు అన్ని బాధ్యతాయుత స్థానాలను మన సొంత అధికారులే చేపట్టవలసి వచ్చింది. ఈ ఉన్నతోద్యోగాలు బ్రిటిష్ రాజ్య కాలంలో ఎన్నడూ భారతీయులకు ఇవ్వడం జరగలేదు. అందువల్ల సైన్యం స్థిరపడటానికి కొద్దికాలం పట్టింది.

మరోపక్క, మన దళాలు మూడు వేర్వేరు ఖండాలలో ఆరు సంవత్సరాలపాటు



రోడ్‌ని రిపేరు చేస్తున్న సైనికులు

పోరాడవలసి వచ్చింది. ఇతరదేశాల సైన్యాలకు లభించిన విశ్రాంతి కాలం కోసరం వారు ఎదురుచూస్తున్నారు. కాని అలా జరగలేదు. విభజన జరిగిన కొద్ది వారాలలోనే పాకిస్తాన్ శత్రువుగా మారి. సాయుధ సైన్యం ద్వారా భారత భూభాగాన్ని ఆక్రమించడానికి ప్రయత్నించింది. వారు పట్టుకోదలచిన మొదటి ప్రాంతం బ్రిటిష్ ఇండియాకి సంస్థానంగా వుండిన కాశ్మీర్. 1947 అక్టోబరులో పాకిస్తాన్ వేలాదిమంది సాయుధ గిరిజనుల్ని లూటీలు, దోపిడీలు చేయడానికి పంపింది. ఈ గిరిజనుల వెనుక క్రమసైన్యాన్ని పంపి. ఆ విధంగా అందాల కాశ్మీర్ లోయను ఆక్రమించాలని వారు ఆశించారు.

ఉన్న స్థితిలో అందుకు సన్నద్ధంగా లేని ప్రధాన మంత్రి జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వంలోని నూతన ప్రభుత్వం. కాశ్మీర్ మహారాజా సహాయం కోసరం చేసిన అభ్యర్థనకు సకాలంలో ప్రతిస్పందించింది. ఢిల్లీకి సమీపంలో ఏ దళాలువుంటే వాటిని హడావుడిగా సమీకరించి. డకోటా పౌర విమానాల్లో పంపింది. భారతీయ సైన్యంలోని ప్రథమ విభాగం కొద్దిగంటలలోనే శ్రీనగర్ గగనతలం వేపు దూసుకురావడం-పాకిస్తాన్‌కు దిగ్భ్రమకలిగించింది.

స్వతంత్ర భారతదేశం సాగించిన అనేక యుద్ధాలలో మొదటిది ప్రారంభం అయింది.



సాగిపోవడానికి సిద్ధంగా ఉన్న టాంక్

# మన సైన్యం పోరాడిన యుద్ధాలు

గిరిజనుల కాశ్మీర్ దాడి జరిగిన వారంరోజుల తర్వాత పరిస్థితి నిరాశాజనకమైంది. మొదటి దూకుడుని వారించగలిగినప్పటికీ, గిరిజనులు తెరపిలేకుండా తోసుకువస్తున్నారు. మొదటి యుద్ధాలలోనే కాశ్మీర్ రాజ్య బలగాల అధిపతి రాజేందర్‌సింగ్ యురి రహదారిమీద హతుడయ్యాడు. వేళ్ళమీద లెక్కించగలిగిన అతని మనుషులు శత్రువులను నిలువరించారు: ఇది ఎంతో ప్రధానమైంది. కల్నల్ రంజిత్‌రాయ్ నాయకత్వాన ప్రథమ భారతీయ బెటాలియన్ రావడానికి ఇది వ్యవధిని కల్పించింది. కల్నల్ రాయ్ యుద్ధంలోకి దిగారు. కానీ అప్పటికే బారాముల్లా పట్టణం శత్రువశమైంది: వాళ్ళు అనేకమంది స్థానికుల్ని చంపేసి, పట్టణానికి నిప్పుపెట్టారు. మరునాడు కల్నల్ రాయ్ యుద్ధంలో చనిపోయాడు: ఇప్పుడు శత్రువు శ్రీనగర్ ద్వారాలవైపు ఉరకలు వేస్తున్నాడు. అక్కడ హడావుడిగా కూర్చుకున్న దళాలతో ఏర్పడిన రెండు బెటాలియన్ల సైన్యం మాత్రమే వున్న బ్రిగేడియర్ సేన్, శ్రీనగర్‌కు పశ్చిమంగా నాలుగుమైళ్ళ దూరంలో వున్న షెలాంగ్ తెంగ్ వద్ద వేలాది గిరిజన దండయాత్రికులను ఎదుర్కొన్నాడు. ఆనాటి తన చర్యలమీదే కాశ్మీర్ భవిష్యత్తు ఆధారపడి వుందని అతను తెలుసుకున్నాడు.

బ్రిగేడియర్ సేన్‌కి జాలిపడ తగినంత తక్కువ సంఖ్యలో దళాలు వున్నాయి. అయిదు వేలకు పైగా వున్న మంచి ఆయుధాలు గల గిరిజనుల్ని ఎదుర్కోవడానికి అతనికి వున్నదంతా కలిపి వెయ్యికిపైగా పదాతి సైన్యం. రెండు సాయుధ శకటాలు. పఠాన్లు మహా ఉత్తేజంతో వున్నారు. ఎందుకంటే, వాళ్ళు స్వల్పమైన భారతీయ బలగాన్ని తోసివేసి, ఆతర్వాత ఎన్నో సంపదలతో నిండివున్న శ్రీనగర్‌ను కైవసం చేసుకోగలమన్న

విశ్వాసంతో వున్నారు.

ఈ నిస్పృహావహమైన పరిస్థితిలో, శత్రువును మోసగించడానికి బ్రిగేడియర్ సేన్ తెలివైన పన్నుగడ పన్నారు. పాకిస్తాన్‌కు, భారత దేశానికి అప్పటికింకా ఒకే రకమైన సాయుధ శకటాలు, ఒకే రకమైన సైనిక దుస్తులు వున్నందున, బ్రిగేడియర్ సేన్ తన రెండు సాయుధ శకటాలను శ్రీనగర్ చుట్టుదారిద్వారా శత్రుపక్షానికి పంపివేశాడు. వాళ్ళు గిరిజనుల వెనుక చోటు చేసుకుని పాకిస్తాన్ వారిలాగే నటిస్తారు. యుద్ధం ప్రారంభమైనప్పుడు వెనుకనుంచి శత్రువుపై కాల్పులు మొదలెడతారు. విజయవంతమైతే, క్రమశిక్షణలేని గిరిజన దాడి దారుల్ని ఇది గందరగోళ పరుస్తుంది.



ఈష్టరన్ సెక్టర్ సరిహద్దు వద్ద కాపలా కాస్తున్న సైనికులు।

అప్పుడు బ్రిగేడియర్ సేన్ యుద్ధం ప్రారంభించమని సంకేతం ఇచ్చారు. ఒక పక్కనుంచి భారతీయ పదాతిసైన్యం. శత్రువు వెనకవైపు లెఫ్టినెంట్ దేవిడ్ నాయకత్వాన గల రెండు సాయుధ శకటాలు కాల్పులు సాగించాయి. పఠాన్లు పూర్తిగా దిగ్భ్రమ చెందారు. తమలో కొన్ని వందలమంది కాల్పులకు గురయ్యేసరికి తమ ఆయుధాలు, మందుగుండు సామాను విడిచిపెట్టి, తోకముడిచి పారిపోయారు. వాళ్ళ వాహనాలన్నీ రోడ్డుమీద, శ్రీనగర్ వేపు ముఖంపెట్టి వున్నాయి. చాలా భయపడిపోయిన పఠాన్లు వాటిని నడిపించి, వెనక్కి తిప్పుకోలేనందున, వాటిని అక్కడే వదిలేసి, పాకిస్తాన్‌కు వెళ్ళే రోడ్డు పల్లంలోకి పరుగెత్తుకుంటూ పోయి అదృశ్యమయ్యారు. మొత్తం మీద ఈ యుద్ధంలో



700 మంది పఠాన్లు హతులయ్యారు. నూటయాభై వాహనాలు, కొన్ని ఆయుధాలు, మందుగుండు సామాను పట్టుబడ్డాయి.

తర్వాత బ్రిగేడియర్ సేన్ పురోగమించి, కొద్ది రోజులలోనే శ్రీనగర్‌కు 60 మైళ్ళ దూరంలో వున్న యురి చేరుకున్నాడు. కాశ్మీర్‌లోయ సురక్షితం.

తరువాతి పద్నాలుగు మాసాల కాలంలో, జమ్ము-కాశ్మీర్ రాష్ట్రంలో తీవ్రమైన యుద్ధం జరిగింది. శ్రీనగర్, పూంచ్ ఇంకా ఇతర ప్రాంతాలను పట్టుకోబోయి గిరిజనులు విఫలమయ్యారని తెలిశాక, పాకిస్తాన్ తన క్రమ సైన్యం దళాలను ప్రయత్నపూర్వకంగా శ్రీనగర్ కాశ్మీర్‌లను కైవశం చేసుకునేందుకు మరింత హెచ్చుగా పంపసాగింది. కానీ, ప్రధానమైన ప్రతి యుద్ధ ప్రాంతంలోను వారి ప్రయత్నాలను భారతీయ సైన్యం వమ్ము చేసింది.

భారతదేశం నుంచి కాశ్మీర్‌కు రైలు మార్గంగానీ, సరైన రహదారిగానీ లేక పోయినప్పటికీ కాశ్మీర్‌లోయ, జమ్మూ ప్రాంతం రెండిటిలోనూ భారతీయ సైన్యం, భారత వైమానిక దళం శక్తిసామర్థ్యాలు క్రమేణా పెంపొందాయి. అనేక ప్రసిద్ధ యుద్ధాలలో మన బలగాలు గెలిచాయి: పాకిస్తాన్ బలగాలు పూర్తిగా చుట్టుముట్టగా భారతదేశం నుంచి విడివడిపోయిన పూంచ్ పట్టణ యుద్ధంలో; 11,000 అడుగుల ఎత్తున పర్వతశిఖరం మీద భారతీయ సైనిక టాంకులు పోరాడిన యుద్ధంలోనూ-ఇంతకుముందెన్నడూ ప్రపంచంలోని ఏ సైన్యం కూడా ఈ రికార్డును అధిగమించలేదు: ఇంకా అనేక యుద్ధాలలో మన బలగాలు గెలిచాయి.

పాకిస్తానీయులు కొంత విజయం సాధించిన ఒకే ఒక్క ప్రదేశం—ఉత్తరాన సుదూరంగా వున్న గిల్గిట్, బల్టిస్తాన్ మంచుప్రాంతాలు. అక్కడికి శీతాకాలంలో చేరడం అంత తేలికకాదు: ఎందుకంటే వందలాదిమైళ్ళు మంచు కప్పిన పర్వతాలు ఆ ప్రాంతాన్ని సూదిలా కనుమను దాటుతున్న జనరల్ రాజేందర్‌సింగ్‌తో, లెఫ్టినెంట్-జనరల్ కె. ఎస్. తిమ్మయ్య (అప్పుడు మేజర్-జనరల్)

కాశ్మీర్ లోయనుంచి వేరుచేస్తున్నాయి. ఇక్కడ కాశ్మీర్ రాష్ట్ర బలగాలకు చెందిన



హిమాలయాల వద్ద కాపలా కాస్తున్న సైనికులు



పశ్చిమ సెక్టర్‌లో టాంక్‌లను ప్రయోగిస్తూ ఎక్సర్‌సైజ్ చేస్తున్న సైనిక బృందం

చిన్న దళం లెఫ్టినెంట్ కల్నల్ థాపా ఆధిపత్యంలో నిరంతరం దాడికి గురి అవుతూ చుట్టు ముట్టబడి వున్న స్కార్దు కోటను నెలలతరబడి కాపాడింది. ఈ బలగానికి సహాయం పంపాలని చేసిన అన్ని ప్రయత్నాలు విఫలమయ్యాయి. చివరికి గిరిజనులు కోటను పట్టుకొని అందులోవి సైన్యం, పౌరసిబ్బందిలోని అత్యధికుల్ని ఊచకోత కోశారు. అయినప్పటికీ భారతీయ సైన్యం అప్పుడే కర్గిల్‌ను స్వాధీనం చేసుకుంది. దాంతో శాంతియుతంగా వున్న లడఖ్ లోయమీద దండెత్తాలనే పాకిస్తాన్ ప్రయత్నాల్ని మన దళాలు వమ్ముచేశాయి.

1960 వరకు భారతదేశం ఒకే ఒక్క దేశానికి—అదీ పాకిస్తాన్‌కి—వ్యతిరేకంగా మాత్రమే పోరాడింది. తర్వాత చైనీయులు మనకు ఎదురు తిరిగి మూడుపక్కలనుంచి భారతదేశాన్ని భయపెట్టారు. అదంతా ఎలా జరిగిందో ఇప్పుడు చెపుతాను.

సంవత్సరాల తరబడి భారత్-చైనాలు కలిసి మెలిసి శాంతియుతంగా జీవించాయి. అయినప్పటికీ భారత్-చైనాల మధ్య సరిహద్దు రేఖ గుర్తించడం కష్టమే. ఎందువల్లనంటే అందులో కొంత భాగం 'ప్రపంచం పైకప్పు' మీద, హిమాలయాలకు వెనుక వుంది. ఈ సమస్యను మనతో శాంతియుత, స్నేహపూర్వక పద్ధతులలో చర్చించడానికి బదులుగా, చైనా వివాద ప్రాంతాలలోకి, ప్రత్యేకించి అకసాయ్ చిన్, నేఫా (ఇప్పుడు అరుణాచల్ ప్రదేశ్ అంటున్నారు) ప్రాంతాలలోకి చొచ్చుకువచ్చింది.

హిమాలయ పర్వతాల ఉన్నత శిఖరాల వరకు వెళ్ళడానికి మనం ప్రధానమైన రహదారులను నిర్మించకపోయినప్పటికీ, సరిహద్దు కాపలాకి మన సైన్యాన్ని కాలినడక ద్వారానే 20,000 అడుగులు, అంతకన్నా ఎక్కువ ఎత్తుకు పంపించాం. అక్కడ చైనా

దళాలు అనేక చిన్న చిన్న దాడులు జరిపాయి. కాపీ మన దళాలు తమ స్థానాల్ని ధైర్యంగా అంటిపెట్టుకున్నాయి. 1962 అక్టోబరులో సరిహద్దు పొడవునా చైనా సామూహిక దురాక్రమణ జరిపింది. భారీతుపాకులు, టాంకుల అండ లేకుండానే మన దళాలు శక్తివంచన లేకుండా పోరాడాయి. కానీ వాళ్ళు అనేక ప్రదేశాలలో వెనక్కి నెట్టివేయబడ్డారు.

మన దళాలు ప్రత్యేకించి చాలా దృఢంగా పోరాడాయి. లడఖ్‌లోని పాంగ్‌గాంగ్ సరస్సు వద్ద ఒంటిపాటుగా వున్న స్థావరంలో కెప్టెన్ థన్‌సింగ్ థాపా నాయకత్వంలో వున్న గోర్ఖాల కంపెనీపై భారీ అయుధాలతో వేలాది చైనీయులు దాడిచేశారు. అతను ఎన్నో కష్టనష్టాలు ఎదుర్కొని తన కందకంలోంచి పోరాడాడు. కానీ చివరికి అతను విజితుడయ్యాడు. కొన్ని నెలల వరకు అతని పేరు వినిపించలేదు. శత్రువుల కాల్పులలో మరణించేంత వరకు చుషుల్ ఉత్తర ప్రాంత పర్వత స్థావరాన్ని వీరోచితంగా కాపాడిన సైతాన్‌సింగ్‌కి ఇచ్చినట్లే, థన్‌సింగ్‌థాపా పరాక్రమానికి పరమవీరచక్ర బహూకరించారు.

దుర్గమమైన ఆ శిఖరాలమీద చైనీయులు చాలాకాలంపాటు పోరాడలేకపోయారు. కొద్దిరోజుల తర్వాత వాళ్ళు తమ పూర్వస్థానాలకు ఉపసంహరించుకున్నారు. అయినప్పటికీ


మేజర్ డి.ఎస్. థాపా

ఇది మనకు ఖచ్చితమైన ఓటమి. ఆనాటినుంచీ మనం పర్వతశిఖరాల మీదకు అనేక రహదారులు నిర్మించాం. పర్వత ప్రాంత డివిజన్లను పునరాయుధం చేశాం. ఈనాడు చైనా ఎలాంటి కొత్త దాడిచేసినా తిప్పికొట్టగల స్థితిలో వున్నాం.

1965లో పాకిస్తాన్ భారత దేశం మీద రెండుసార్లు దాడి చేసింది. మొదటిసారి, వసంత ఋతువు చివరలో సౌరాష్ట్రలోని

కచ్ రాణాలో మన సరిహద్దును పాకిస్తాన్ దళాలు అతిక్రమించాయి. మనం వాళ్ళని నిలువరించాం. కానీ ఆ సమస్యలేవీ తేలక ముందే వాళ్ళు గెరిల్లా దళాలతో కాశ్మీర్‌లో దాడిచ దానికి అనుక్రమణికగా పశ్చిమ జమ్మూలోని చాంబ్ మైదానాల మీద భారీ దాడిని నిర్వహించారు. మన సహనం అంత రించింది. వాళ్ళమీద ఒత్తిడి తీసుకురావ దానికి పశ్చిమ పంజాబ్ మీద దాడిచేసి వాళ్ళని తిప్పికొట్టాం. మనదళాలు లాహోర్ పొలిమేరలు చేరడంలో విజయవంతము లయ్యాయి. అయినప్పటికీ, సరిగ్గా అదే సమయంలో శక్తివంతమైన పాటన్ టాంకు లతో ప్రసిద్ధమైన పాకిస్తాన్ మొదటిసాయుధ శకటాల డివిజన్ పంజాబ్‌లోని ఖేమ్‌కరణ్ వద్ద మనమీద దాడిచేసింది. అది మనకు వినాశకరంగా పరిణమించి వుండేది. కానీ మన యువ టాంక్ ఆఫీసర్లు పదాతిసైన్యం నాయకుల అద్భుత ధైర్యం చెక్కుచెదర లేదు. వాళ్ళు తమకంటే ఆధిక్యతగల బలగాలతో పోరాడుతున్నప్పటికీ, అనేక ప్రాణత్యాగాలతో సాయుధ శకటాల దాడిని



సాగిపోతున్న విజయంతా టాంక్

ఎదుర్కొని, వందలాది పాకిస్తానీ టాంకులను ధ్వంసం చేశారు. నేనిప్పుడు ఖేమ్‌కరణ్ యుద్ధంలో ప్రాణాలు అర్పించిన అబ్దుల్ హమీద్ గాథ చెబుతాను.

ఒక ఓపెన్ జీప్‌లో కూర్చుని రికాయిల్‌లెస్ యాంటీ-టాంక్ గన్‌తో చెరకు తోటలలోనుంచి తన ప్రధాన రక్షణశ్రేణివేపు వెళుతూ అబ్దుల్‌హమీద్ అకస్మాత్తుగా నాలుగు పాకిస్తానీ టాంకుల మీదకు వచ్చారు. అతనికి సంఖ్యాబలం బొత్తిగా లేదు. కానీ అతను పరుగెత్తడానికి ప్రయత్నించలేదు. తక్షణమే కాల్పులు సాగించాడు. ఒకదాని తర్వాత ఒకటి-మూడు టాంకుల్ని పడగొట్టాడు. అతను శత్రువుల టాంకులకు చాలా దగ్గరలో వున్నాడు. కానీ చాలా నిబ్బరంగా, సమీకృతంగా వున్న అతని చర్యలు శత్రువును పూర్తిగా దిగ్భ్రమ పరచాయి. దురదృష్టవశాత్తు, నాలుగవ టాంకుకు గురి చూస్తుండగానే—ఒక టాంకు గుండు తగిలి అతను తునాతునకలైపోయాడు.

ఈ దిగువ ఉల్లేఖనతో అతనికి పరమవీరచక్ర బహూకరించారు:

"ఒక పోరాటంలో దుర్భేద్యంగా కనిపించిన పాటన్ టాంక్‌దళాలను ఈయనకున్న



హవల్దార్ అబ్దుల్ హమీద్



పాకిస్తాన్‌కు చెందిన టాంక్‌లు

ఛిన్న రికయిల్‌లెస్ దళం ఎదుర్కొంది. ఈయన అసాధ్యాన్ని సాధ్యం చేశారు.”

అంతకుముందే కర్గిల్‌నుంచి (శ్రీనగర్‌లోయ ఉత్తరం వరకు) బార్మర్‌వద్ద రాజస్తాన్ ఎడారి వరకు నిరంతరం యుద్ధం సాగుతూనే వుంది. యుద్ధశ్రేణి అంతటా తీవ్ర పోరాటం సాగుతూంది. రెండు వైపులా మరణాలు హెచ్చుగానే వున్నాయి.

ఐక్యరాజ్య సమితి కాల్పుల విరమణ ఏర్పాటు చేయడంతో ఇరవై రెండు రోజుల పోరాటం అనంతరం యుద్ధం ముగిసింది. అప్పటికి మనం పాకిస్తానీ పాలనలో పెద్ద భూఖండాలను, ప్రత్యేకించి మూడు ప్రాంతాలలో—దక్షిణ రాజస్తాన్ ఎడారి ప్రాంతంలో, ఉత్తర అమృతసర్ ప్రాంతంలో, పతాన్‌కోట—జమ్ము సరిహద్దు దక్షిణ ప్రాంతంలో—పట్టుకున్నాం. నిజాయితీగా చెప్పాలంటే మనం బ్రహ్మాండమైన విజయాన్ని సాధించలేదనే అనాలి. ఎందువల్లనంటే శత్రువు మీద నిర్ణయాత్మకమైన ఓటమిని విధించడానికి కాల్పుల విరమణ జరిగింది. కానీ చివరికి మన చేతిలోనే భూభాగం మిగిలింది. బ్రహ్మాండమైన విజయం ఆరు సంవత్సరాల తర్వాత రానుంది.

# బంగ్లాదేశ్ యుద్ధం

1971 ఆగస్టులో ఒక తుఫాను రాత్రి ముగ్గురు బెంగాలీ కుర్రవాళ్ళు మైమన్‌సింగ్ వద్ద ఒక తేయాకు తోటలోనుంచి రహస్యంగా పాకుతున్నారు. వాళ్ళంతా చిన్నవాళ్ళే. అందరికంటే చిన్నవాడు ఫజ్లర్‌కి మహావుంటే పధ్నాలుగేళ్ళు. వాళ్ళు, అయిదు నెలల నాడు పాకిస్తాన్ సైన్యం బీభత్స కాండ ప్రారంభించినప్పుడు తూర్పు బెంగాల్ అంతటా తల ఎత్తిన ప్రతిఘటన బలగం ముక్తివాహినికి చెందినవాళ్ళు.

ఆ ముగ్గురు స్నేహితులు తమ గ్రామం నుంచి ఉత్తరంవేపు భారతదేశ సరిహద్దు వేపు వస్తున్నారు. అక్కడ వాళ్ళకి ఆయుధాలు, శిక్షణ ఇస్తారని ఎవరో చెప్పారు. పగటివేళ అడవుల్లో పడుకుంటూ, రాత్రిళ్ళు చీకటి మరుగున ముందుకు సాగుతూ, వారం రోజులుగా ప్రయాణిస్తున్నారు. కొన్నిసార్లు వాళ్ళకి మిత్రులైన గ్రామప్రజలనుంచి తిండి దొరికేది. కానీ తరుచుగా ఆకలితోనే ఉండవలసి వచ్చేది. కానీ, ఇప్పుడు వాళ్ళు సరిహద్దుకి చాలా దగ్గరగా వున్నారు. చాలా ఉద్వేగంతో వున్నారు.

వాళ్ళు తేయాకు తోటల చివరవున్న, చిన్న కూలీల ఇళ్ళదగ్గరకు వచ్చారు. ఉత్తరంనుంచి వచ్చే ఒక వ్యక్తిని కలుసుకోవడానికి ఇది నిర్ణీత స్థలం. మరునాటి వరకు అక్కడే తేయాకు పొదలలో దాక్కొని, అనుకున్న సంకేతం కోసరం ఎదురుచూద్దామని వాళ్ళు నిర్ణయించుకున్నారు. వాళ్ళలా చేయడమే మంచిదయింది. ఎందువల్లనంటే అకస్మాత్తుగా వాళ్ళ చుట్టూ కాల్పులు ప్రారంభం అయ్యాయి. తమను పట్టుకుపోవడానికి పాకిస్తాన్ సైన్యం వచ్చిందేమోనని వాళ్ళు చాలా భయపడ్డారు. కానీ, వాళ్ళు తొందరలోనే కొన్ని పాకిస్తానీ ట్రక్కులు త్వరితంగా వెనక్కు వెళ్ళడం చూశారు. అనేక దళాలుకూడా

వెనక్కి పరుగెత్తాయి. సాయంత్రం అయ్యేసరికి మళ్ళా అంతా ప్రశాంతంగా వుంది. అప్పుడు వాళ్ళు ఒక ఇంటిమీద నారింజరంగు జెండా ఎగరడం చూశారు. ఆ సంకేతం కోసరమే వాళ్ళు ఎదురు చూస్తున్నారు. ఇంకా ఉద్వేగంతో కంపిస్తూనే వాళ్ళు ఆరుబయటకు వచ్చి, ఆ ఇంటికి వెళ్ళారు.

అక్కడ వాళ్ళు, అనేకమంది బెంగాలీ గెరిల్లాలను కలుసుకున్నారు. వాళ్ళు ఆ రోజు ఉదయన్నే పాకిస్తానీ దళాలపై దాడిచేశారు. అక్కడ భద్రతా దళానికి చెందిన ఇద్దరు కూలీల్లాగా మారు వేషాలతో వున్నారు. ఆ కుర్రవాళ్ళకు తాగడానికి టీ, తినడానికి చేపలూ, అన్నమూ ఇచ్చారు. అప్పుడు వాళ్ళు ఎక్కడైతే రహస్య స్థావరం వుందని ఆశించారో, ఆ భారతీయ సరిహద్దులకు వెళ్ళారు.



పశ్చిమ ప్రాంతంలో టాంక్‌లను ప్రయోగిస్తూ ఎక్సర్‌సైజ్ చేస్తున్న సైనికులు

ఈ ముగ్గురు మిత్రులూ తూర్పు బెంగాల్‌నుంచి వచ్చి గెరిల్లా బృందాలలో చేరిన వేలాది మందిలో ఒకరు. అక్టోబర్, నవంబర్ మాసాలలో పాకిస్తాన్ సైన్యాలకు వ్యతిరేకంగా సాగిన అనేక దాడులలో ఫజ్లర్ పాల్గొన్నాడు. యుద్ధం ప్రారంభంకాగానే అతనూ, అతని బృందమూ భారతీయ సైన్యంతో కదంతొక్కి వడిచారు.

అది మనమీద బలవంతంగా రుద్దిన యుద్ధం. అధ్యక్షుడు యాహ్యాఖాన్ తూర్పు బెంగాల్‌లో సాగిస్తున్న బీభత్సాన్ని అదుపుచేసేలా కృషి చేసేందుకు ప్రపంచ నాయకులను ఒప్పించాలని అప్పటి ప్రధాని ఇందిరాగాంధీ చేయగలిగినదంతా చేశారు. లక్షలాది ప్రజలను



నదిని దాటేందుకు బ్రిడ్జ్-తయారుచేస్తున్న సైనికులు

చంపేశారు: లక్షలాదిమందిని ఇళ్ళనుంచి వెళ్ళగొట్టారు. కోటిమంది సరిహద్దుదాటి కాందిశీకులుగా వచ్చారు. ఏదో ఒకటి చేయవలసి వుంది.

1971 డిసెంబరు 3న యాహ్యాఖాన్ పశ్చిమంనుంచి భారతదేశంపై దాడిచేశాడు. కాశ్మీర్, పంజాబులలో భారత దేశంపై విజయం సాధించగలననీ, దానితో మన దృష్టిని తూర్పు బెంగాల్ నుంచి మళ్ళించవచ్చుననీ అతని ఆలోచన. కానీ ఈచర్య అతనికి వినాశకరమైంది: మనం ఎదురుచూస్తున్న అవకాశాన్ని అతను ఇచ్చాడు.

తూర్పు పాకిస్తాన్ అప్పటికే తన స్వాతంత్ర్యాన్ని నూతన "బంగ్లాదేశ్"గా ప్రకటించింది.

ఢిల్లీలో జనరల్ మానెక్ షా (తర్వాత ఫీల్డ్ మార్షల్) సేనాధిపతి. కలకత్తాలో లెఫ్టినెంట్ జనరల్ అరోరా తూర్పు సేన కమాండర్. భారతదేశ సరిహద్దు భద్రతాదళాలతో, దానికి సహాయపడే దాదాపు లక్షమంది ముక్తివాహిని గెరిల్లాలతో వారు ఈ యుద్ధానికి తగిన అత్యవసర పథకాలను రూపొందించుకుంటున్నారు. మొత్తం బంగ్లాదేశ్ జనతా అంతా మన పక్షం. వారు మన బలగాలకు బ్రహ్మాండమైన సహాయం చేశారు.

ఎంతో తెలివైన సైనిక ఎత్తుగడలతో, అద్భుతమైన కార్యంలో ఏడు భారతీయ సైనిక డివిజన్లు నాలుగువేపులనుంచీ బంగ్లాదేశ్ లో ప్రవేశించారు. వరిపొలాల మీదుగా, నదులు, బురద నేలలు, సరస్సులు వంటి జలమయ ప్రాంతాలమీదుగా పాకిస్తాన్ బలగాలను పూర్తిగా ఓడిస్తూ మన బలగాలు ఢాకాను అన్ని వైపులనుంచి ముట్టడించాయి. పన్నెండు రోజులలోనే ఢాకా పట్టుబడింది. 90,000కు పైగా పాకిస్తాన్ సైనికులు ఖైదీలుగా చిక్కారు. బంగ్లాదేశ్ విమోచన పొందింది.

స్వతంత్ర భారత దేశం సైన్యం దేశానికి వెలుపల పోరాడటం ఇదే మొదటిసారి. ఇది చాలా అద్భుత సైనికచర్య. మన దళాలు ఢాకాకు పురోగమించడంలో అన్ని రకాలైన ఇబ్బందుల్ని అధిగమించాయి. రహదారులు లేనిచోట తుపాకులు, ఇతర భారీ సామగ్రిని భాగాలుగా విడదీసి వ్యక్తులే—భారతీయ దళాలు, బంగ్లా ప్రజలు—మోసు

కెళ్ళారు. వంతెనలు లేనిచోట వేలాదిమంది స్థానికులు నదులకు టన్నులకొద్దీ మట్టిపోసి మన టాంకులు వాహనాలు దాటి వెళ్ళడానికి అనకట్టలు నిర్మించారు. ఆహారం స్వల్పంగా వున్న చోట్ల గ్రామీణులు తమకున్న కొద్ది పాటి నిల్వలతోనే మనదళాలను పోషించారు. దాడిచేసే సైన్యానికి ఇంత భారీ స్థాయిలో ప్రజల అండ లభించడం. ఏడున్నరకోట్ల ప్రజల దేశాన్ని 12 రోజులలోనే విముక్తి చేయడం యుద్ధ చరిత్రలో ఎన్నడూ జరగ లేదు.



తుపాకులతో పురోగమిస్తున్న సైనికులు

పశ్చిమరంగ యుద్ధంలో భారతీయ సైన్యం సంపూర్ణవిజయం కోసరం వెళ్ళలేదు. పశ్చిమ రాజస్థాన్‌లోని కొంత భాగాన్ని మనం పట్టుకున్నాం. అలాగే పశ్చిమ పఠాన్‌కోట ప్రాంతంలో కూడా పాకిస్తాన్ లోపలి వరకూ చొచ్చుకు పోవాలనేది మన రాజకీయ ఆశయం కాదు. ఈ కథారంభంలో నేను వివరించిన బసంతర్ యుద్ధంలాగా వారి దాడులను నిలుప రించడం, ఆ తర్వాత ఒక చిన్న స్థాయి యుద్ధాన్ని నిర్వహించడం మన లక్ష్యం. ఢాకాలో పాకిస్తాన్ దళాలు లొంగిపోగానే కాల్పుల విరమణకు శ్రీమతి గాంధీ ఆదేశించారు. ఒకటి రెండు రోజులలోనే పాకిస్తాన్ కూడా పోరాట విరమణకు అంగీకరించింది.

# సైన్యాన్ని ఎలా నిర్వహిస్తారు?

కాశ్మీర్ యుద్ధం తర్వాత సాపేక్షంగా చూస్తే, భారత దేశం ఒక సుదీర్ఘ దశలో పూర్తి శాంతియుతంగా ప్రశాంతంగా వుంది. దళాలు ఇంకా కాశ్మీర్, పంజాబు సరిహద్దులను కాపలాకాస్తున్నాయి. కానీ సైన్యానికి పథకాలు ప్రారంభించేందుకు ఒక జాతీయ వ్యాపిత నిర్మాణాన్ని రూపొందించేందుకు అవకాశం వుంది.

ఇప్పుడు సైన్యాన్ని ఎలానిర్మింయుతారో అది ఎలా పనిచేస్తుందో కొద్దిగా చెపుతాను.

ప్రధాన పోరాట సైన్యాన్ని పదాతి సేన అంటారు. వాళ్ళు నిలబడి పోరాడేవారు. ఒకపదాతిసేన బెటాలియన్‌లో రైఫిల్స్, మెషిన్‌గన్లు, మోర్టార్లు వంటి ఆయుధాలతో ఒక వెయ్యిమంది సైనికులు వుంటారు. కానీ వాళ్ళు యుద్ధానికివెళ్ళినప్పుడు, వాళ్ళకి సహాయం చేసేందుకు భారీ తుపాకులు, టాంకులు అవసరం. కనుక మనకు టాంకు రెజిమెంట్లు వున్నాయి. వాటిని సాయుధ శకటాల, శతఘ్నిదళాల రెజిమెంట్లు అంటారు. శత్రువుతో పోరాడేందుకు వాటన్నిటినీ బ్రిగేడులు డివిజనులతో కలుపుతారు.

ఇవన్నీ రంగంలో ఉండి పోరాడే విభాగాలు. వంతెనలు, రోడ్లు, జలకేంద్రాల (మంచినీటి కోసరం) నిర్మాణంలో వారికి సహాయం చేసేందుకు మనకు ఇంజనీర్ బెటాలియన్లు వున్నాయి. పరికరాలన్నిటినీ వీరే తీసుకెళతారు. టెలిఫోన్ లైన్లు, వైర్‌లెస్ కమ్యూనికేషన్‌ల ఏర్పాటులో సాయపడేందుకు సిగ్నల్స్ బెటాలియన్లు వున్నాయి.

ఇక సైన్యాలకు భోజనాలు పెట్టాలి. యుద్ధంలో మందుగుండు ఇవ్వాలి. వారి ట్రక్కులు, ఆయుధాలు మరమ్మత్తు చేయాలి. వారి గాయాలను మాన్పాలి. వీటికోసరం

వుండే దళాలను సరఫరా, రవాణా, విద్యుత్, మెకానికల్ ఇంజనీర్స్, ఆర్డ్‌నెన్స్, మెడికల్ బెటాలియన్లు అంటాం. పోరాడే సేనలకు సాయం అందించడం ప్రధాన కర్తవ్యం అయినప్పటికీ, అవసరమైతే పోరాడేందుకు వారంతా సుశిక్షితులే.

బ్రిగేడ్‌లు, డివిజన్లు అని పిలిచే పోరాట దళాలను ఎక్కడికైనా పంపవచ్చు. ఒకొక్కసారి ఒక డివిజన్‌ను భారత్‌లో ఆ మూలనుంచి ఈ మూలకు పంపవచ్చు. ఒక యుద్ధం మధ్యలో పంజాబ్‌నుంచి అస్సామ్‌కు పంపవచ్చు. అందువల్లనే పోరాడే డివిజన్‌ల ప్రయాణాలకు తోడ్పడేందుకు భారతదేశమంతటా ఇతరదళాలు సర్వసన్నద్ధంగా వుంటాయి. ఆ విధంగా పౌరప్రభుత్వానికి రాష్ట్రాలూ, జిల్లాలూ వున్నట్లే సైన్యానికి కమాండ్‌లూ, ప్రాంతాలూ, ఉపప్రాంతాలూ ఉంటాయి.



వాయుసేన హెలికాప్టర్స్ సైనిక వైద్య బృందం సహాయంతో పశ్చిమ ప్రాంతంలో ప్రజలకు సహాయపడుతున్న దృశ్యం




ఆర్మీ ఎయిర్ హెలికాప్టర్ అబ్జర్వేషన్ పోస్ట్

ఉదాహరణకు ఢిల్లీ పశ్చిమ కమాండ్‌లో ఉంది. దాని కేంద్ర కార్యాలయం సిమ్లాలో వుంది. అసలు ఢిల్లీలోనే ఒక ప్రాంత కేంద్ర కార్యాలయం వుంది. పంజాబ్ కూడా పశ్చిమ కమాండ్‌లోనే వుంది. మరోపక్క అస్సాం తూర్పు కమాండ్‌లో వుంది (కలకత్తా కేంద్ర కార్యాలయం). అన్నిటికంటె పెద్దది దక్షిణ కమాండ్. దీని కేంద్ర కార్యాలయం పూనా.

రంగంలో శత్రువుపై పోరాడేందుకువెళ్ళే బ్రిగేడ్‌లు, డివిజన్‌ల శాశ్వతస్థావరాలు ఈ కమాండ్‌లూ, ప్రాంతాలే. శాంతికాలంలోనూ, యుద్ధకాలంలోనూ పని ఈ పద్ధతిలో నిర్వహిస్తారు.

సైనిక శ్రేణుల గురించి ఒక మాట. మొత్తం మీద చెప్పుకోవాలంటే సైనిక సిబ్బందిలో మూడు ప్రధానమైన తరగతులున్నాయి—ఆఫీసర్లు, జూనియర్ కమిషన్డ్ ఆఫీసర్లు, చేర్చుకున్న సైనికులు. చివరి వారిని ప్రేమగా 'జవాన్'లు అని పిలుస్తాం.

ఆఫీసర్ శ్రేణిలో, అత్యున్నత స్థానం జనరల్ నుంచి అట్టడుగు స్థానం సెకండ్ లెఫ్టినెంట్ వరకూ వుంటాయి. భారత సైన్యంలో పూర్తిస్థాయి జనరల్ ఒక్కరే వుంటారు. ఆయన కొత్తఢిల్లీలోని సైన్యాధిపతి. ఆయన కింద అనేకమంది లెఫ్టినెంట్ జనరల్‌లు, వారికింద మేజర్ జనరల్‌లు ఉంటారు. కోర్ డివిజన్‌లపై వారి ఆధిపత్యం వుంటుంది. తర్వాత బ్రిగేడ్‌లపై ఆధిపత్యంగల కల్నల్‌లు, లెఫ్టినెంట్ కల్నల్‌లు వుంటారు. రెజిమెంట్‌లు, ఇతర కింద నియామకాలలో మేజర్‌లు, కెప్టెన్‌లు, లెఫ్టినెంట్‌లు, సెకండ్ లెఫ్టినెంట్‌లు వుంటారు.

జూనియర్ కమిషన్డ్ ఆఫీసర్లు అంటే కింది స్థాయి అధికారులు. వారి శ్రేణులు సుబేదార్లు (లేదా రిసాల్దార్లు), నాయిబ్ సుబేదర్లు (లేదా రిసాల్దార్లు). కొన్ని పెద్ద యూనిట్లకు కూడా సుబేదార్ (లేదా రిసాల్దార్) మేజర్ జూ.క.ఆ.గా ఉంటారు. ఈ అధి



ఎక్స్‌పెడిషన్‌కు పైన సైనిక కూటమి

కార్లు అత్యధికంగా సైనికులనుంచి ప్రమోషన్ పొందినవారే.

సైన్యంలో జవాన్లు అతి తక్కువన సిపాయిలు, (సిపాహీ అనే పదం నుంచి వచ్చింది)గా చేరుతారు. వారిని ప్రమోట్ చేసినపుడు నాయక్, హవల్దార్ వంటి నాన్-కమిషన్డ్ శ్రేణులను పొందుతారు. కొంతమంది సిపాయిల్లు ముందుగా చెప్పిన జూ.క.ఆ. శ్రేణులను పొందుతారు.

సిపాయిలనుంచి, జనరల్ వరకూ ఈ శ్రేణులన్నీ మహత్తర సోదరభావానికి ప్రతీకలు. స్థాయీభేదాలతో నిమిత్తం లేకుండా వారంతా ఒకరినొకరు సోదరుల్లా భావిస్తారు. సైన్యానికి ఆఫీసర్లు ఆదేశాలు, శిక్షణ ఇచ్చి నాయకత్వం వహిస్తారు; జూ.క.ఆ.లు, నా.క.ఆ.లు తమ సైనికుల నిర్వహణ చూస్తారు. తమ పనిలో మార్గదర్శకత్వానికీ, ఆదేశాలిచ్చేందుకూ ఆఫీసర్లు, జూ.క.ఆ.లు, నా.క.ఆ.లపై జవాన్లు ఆధారపడతారు.

వ్యక్తులను ఒక ప్రాంతానికిగానీ, యుద్ధశ్రేణి బెటాలియన్‌కుగానీ ఎక్కడికైనా పంపవచ్చు. సాధారణంగా ఒకచోట నూదేర్చుకుంటారు. కానీ యుద్ధ పరిస్థితిమీదే అది ఆధారపడి వుంటుంది.

సైన్యంలో జీవితం చాలా గడ్డుగా వుంటుందని జనం అంటారు. ఎందుకంటే మిమ్మల్ని సరిహద్దుకైనా పంపవచ్చు; సమున్నత హిమాలయాలకైనా పంపవచ్చు. అక్కడ మీ కుటుంబాలనుంచి విడివడిపోవచ్చు. ఇది కొంతవరకూ నిజమే. కానీ సైన్యంలో ఎన్నో సదవకాశాలున్నాయి. బోలెడంత ఆహారం, చక్కని ఆరోగ్యం వుంది. మీరెక్కడున్నా సరే అది పంపుతారు. మీరు చేయదగిన ఎన్నెన్నో ఆసక్తికరమైన పనులు-పర్వతారోహణ, లేదా ట్రెక్కింగ్ నడపడం, స్కీయింగ్ వంటి పనులు మీరు చేయగలరు. అవెంతో ఆనందంగా వుంటాయి. సైన్యంలో లేనివారు ఆ పనులు చేయడానికి వేలాది రూపాయలు ఖర్చుచేస్తారు.

ఇంటికి వెళ్లేందుకు సెలవు బోలెడంత వుంటుంది. ప్రయాణం ఉచితం. కనుక తల్లిదండ్రులనుగానీ, భార్యాబిడ్డలనుగానీ తరుచు చూసేందుకు అవకాశం ఉంటుంది. పని, పనుల నిర్వహణే అన్నిటికన్నా ప్రధానమైనదని సైన్యం చెపుతుంది. సాధారణ

జీవితంలో గల అనేక సౌకర్యాలను యుద్ధంలో ఎవరైనా వదులుకోవలసి వుంటుంది. ఏమైనా సైనికుల్లో ఒక చైతన్యం, నేను ముందే చెప్పిన "సోదర భావం" వుంటాయి. సాధారణ ప్రజానీకం వాటిని ఎప్పటికీ అనుభవించక పోవచ్చు. రాము చేసే సేనలో ఒక గర్వం కూడా వుంది.

ఇవన్నీ సైన్యంలో జీవితాన్ని చక్కని అనుభవంగా చేస్తాయి.

# సైన్యంలో జీవితం

నేనిప్పుడు పదమ్ బహదూర్ అనే యువకుడి కథ చెప్పుతాను. 1946-48 నాటి కాశ్మీర్ యుద్ధంలో సుదీర్ఘమైన పూంచ్ దిగ్బంధన సమయాన మొట్టమొదటిసారిగా అతన్ని కలుసుకున్నాను. అతను మహా సిగ్గరి. యువకుడు, సైనికుడు. డెహ్రాడూన్‌లో రిక్రూట్‌గా శిక్షణ పొందిన తర్వాత ఆ మధ్యనే బెటాలియన్‌లో చేరాడు.

మొట్టమొదటిసారిగా పూంఛ్‌కి వచ్చినప్పుడు మహాసిగ్గుపడుతూ ఇతర సైనికులతో ఒక పట్టాన కలిసేవాడు కాదు. వాళ్ళలో కొంతమంది ఉన్నంత తెలివిగలవాడు కాదు; చిన్నగా వుంటాడు; ఆటలంటే అంతగా ఆసక్తి లేదు. అందుకే కొంతకాలం సిగ్గరిగానే మిగిలిపోయాడు. మొత్తంమీద క్రమంగా బెటాలియన్‌లోని వారు అతని బెరుకుపోగొట్టారు. అతను మరింత కలివిడిగా అయ్యాడు. మరింత సునాయాసంగా స్నేహితుల్ని చేసుకుంటున్నాడు.

అప్పుడొచ్చింది అతని మొదటి యుద్ధం. ఒక పర్వత శిఖరాన అతని బెటాలియన్ రాత్రి దాడి చేయవలసి వుంది. కల్నల్ పరివారంలో ఒకడుగా ఉండే పనిని పదమ్ బహదూర్‌కి కేటాయించారు.

నిడుపాటి కొండపైకి బెటాలియన్ వెళుతున్నప్పుడు దాడి అర్ధరాత్రి మొదలయింది. విపరీతంగా కాల్పులు జరిగాయి. త్వరలోనే కొంతమంది గాయపడ్డారు. పరివారం విభాగాన్ని పదమ్ బహదూర్ ఒంటిపెట్టుకుని వున్నాడు. మాప్‌ను అధ్యయనం చేస్తూ, తన పోర్టబుల్ రేడియో సెట్‌పై ఆదేశాలివ్వటంలో అత్యధిక కాలాన్ని వెచ్చించే కల్నల్‌ను వేయి కళ్ళతో కనిపెట్టుకుని ఉన్నాడు.

ఉదయాన అగ్రగామి సైనికదళాలు పర్వత శిఖరానికి అతిచేరువలో కనిపించాయి. హఠాత్తుగా పైనుంచి మర తుపాకీ కాల్పులు వచ్చాయి. పదమ్ బహదూర్ కల్నల్‌కి కుడి పక్కన ఉన్నాడు. అక్కడొక పెద్ద రాయి అతన్ని శత్రువుకు కనిపించకుండా చేసింది.



లాన్స్‌నాయక్ జదునాథ్ సింగ్



హవల్దార్ పీరూ సింగ్

కానీ కల్నల్ కొద్దిగా గాయపడినట్లూ, మళ్ళీ కాల్పులకు గురికాకుండా నేలపై పడుకున్నట్లూ అతను చూడగలిగాడు. అతను ముందుకు వెళ్ళలేకపోయాడు.

ఒక్క క్షణంలో పదమ్ బహదూర్ తన సిగ్గునూ, బిడియాన్నీ మరిచిపోయాడు. ఆ మరతుపాకీ నోరు మూయించకపోతే కల్నల్ తీవ్రంగా గాయపడతాడు: లేదా చని పోతాడని గుర్తించాడు. తన సంచిలోంచి గ్రెనేడ్ తీశాడు. కుడి పక్కకు పాకుతూ వెళ్ళాడు. అతని శరీరం నేలను కరుచుకుంది కొండపైకి మెల్లమెల్లగా వెళుతున్నాడు. మరతుపాకీకి 30 గజాల దూరానికి వచ్చేసరికి, గ్రెనేడ్‌ను శత్రువు పైకి విసిరాడు. లేచి నిలుచుని తన రైఫిల్‌కి సన్నీని తగిలించి తిన్నగా మరతుపాకీ స్థావరం మీదకి ఉరికాడు.

గ్రెనేడ్ పేలింది. తుపాకీ పట్టిన శత్రువు మరణించాడు. మరో మనిషి పేలుడునుంచి తేరుకునే లోగానే పదమ్ బహదూర్ అతనిమీద ఉన్నాడు. రైఫిల్‌తో కాల్చాడు. అతనొక మనిషిని చంపి, మరొకర్ని ఖైదీగా పట్టుకున్నాడు. తర్వాత



మేజర్ సోమనాథ్ శర్మ



కెప్టెన్ ఆర్.ఆర్. రాణె

స్థావరం మన వశమైందని సెక్షన్ కమాండర్‌కు సిగ్నల్ పంపాడు.

పదమ్ బహదూర్ తన సెక్షన్‌కు వీరచక్ర సాధించాడు. అయినా సరే అదే మనిషి అప్పటిలాగే-రైతుగా, సరదాగా ఉండే సైనికుడుగా-ఇంకా కొంచెం సిగ్గు, పనిలో ఆనందం, అందరితో స్నేహపూర్వకంగా వుంటున్నాడు. ఆ తృటికాలం ఘటనలో అతనికి ఆ సాహసం వచ్చింది. మన ఆఫీసర్లు, సైనికులలో అత్యధికులు అంతే. వారంతా ఏళ్ళతరబడి కలిపి పనిచేస్తారు. జీవిస్తారు. కనుక ప్రమాదం వచ్చినప్పుడు అత్యధికులు దాన్ని గంభీరంగా ఎదుర్కొంటారు. ఇతరులను రక్షించడానికి, లేదా విధి నిర్వహణ కోసరం తమ ప్రాణాలను పణం పెడతారు.

భారత సైన్యంలో యువకు లెవరైనా చేరవచ్చు. అయితే శారీరకంగా తగిన వారై ఉండాలి. వారు ఆఫీసర్ కేడెట్‌గా చేరవచ్చు. అప్పటినుంచే వారికి శిక్షణ ఉచితం. శిక్షణను జయప్రదంగా ముగించిన తర్వాత వారిని రెజిమెంట్‌కు, లేదా

లాన్స్‌నాయిక్ అల్బర్ట్ ఎక్కా సుబేదార్ జోగిందర్ సింగ్ కెప్టెన్ గురుబచన్ సింగ్



లాన్స్‌నాయక్ కరణ్ సింగ్



లాన్స్‌నాయక్ ఆల్బర్ట్ ఎక్కా



సుబేదార్ జోగిందర్ సింగ్

బెటాలియన్‌కు పంపుతారు. వారిని పదాతిసేన బెటాలియన్‌కుగానీ, సాయుధశకట (టాంక్) రెజిమెంట్‌కుగానీ, లేదా గన్నర్స్ (శతఘ్ని దళం)కుగానీ పంపవచ్చు. వారికి సాంకేతిక అభిలాషవుంటే ఇంజనీర్స్ లేదా సిగ్నల్స్‌కు పంపవచ్చు. ఇంకా సరపరా, రవాణా, ఇతర సర్వీసుల యూనిట్లకు వెళ్ళేవారున్నారు.

వారెక్కడికి వెళ్ళినా సరే తమ సహచరులతో సన్నిహితంగా జీవిస్తారు. ఒక బృందంతో కలిసి తింటారు; నిద్రిస్తారు; పని చేస్తారు. విశాలమైన జీవితం గడుపుతారు. పనికాక ఆటపాటలకు అంతులేని అవకాశాలుంటాయి.

సైన్యంలో చేరడానికి ఒక యువకుడు 'సాహసికుడై' వుండాలా? అని నన్ను

తరుచుగా ఎదురుగుతుంటారు. ఈ సాహసం అనేది ఇప్పుడు ఎంపిక చేసిన కొద్దిమంది లక్షణం కాదు. శిక్షణ మంచిదైతే, మిత్రులతో సన్నిహిత సోదరభావం వుంటే, పనిలో ఆనందం పొందితే ప్రతి ఒక్కరూ ధైర్యసాహసాలను ప్రదర్శించవచ్చు. అదే సమయంలో భయంవేసే ఘటనలు ఎవరికైనా ఎదురుకావచ్చు. మన జీవితాలలో అత్యధికులకు ఇలాగే







కెప్టెన్ గురుబచన్ సింగ్ ఆర్. పరమేశ్వరన్ ఫ్లై.లెఫ్ట్. ఎన్.ఎస్. శేఖన్

జరుగుతుంది.

సైన్యంలో పదమ్ బహదూర్ ఉద్యోగాన్ని మరికొంత పరిశీలిద్దాం. కాశ్మీర్ యుద్ధం ముగిసింది. బెటాలియన్ శాంతికేంద్రానికి తిరిగి వచ్చింది. అది పంజాబ్‌లో ఒక కంటోన్‌మెంట్. అక్కడ జీవితం మరింత క్రమబద్ధంగా వుంది. మరో పదిమంది సైనిక మిత్రులతో కలిసి బారక్ గదిలో నివసించాడతను. ప్రతి ఉదయం మూడు నాలుగు గంటలు ఆరుబయలు శిక్షణకు హాజరయేవాడు—అంటే చలాకీగా ఉండేందుకు కొంత డ్రిల్లు, లక్ష్యాన్ని గురిచూసి కాల్చడం, మరతుపాకి శిక్షణలాంటి ఎన్నో ఆయుధాల తర్ఫీదు, అలాగే ఎన్నో విద్యాతరగతులకు హాజరు. తినేందుకు చక్కని సంపూర్ణాహారం ఉండేది.

వారానికి రెండుసార్లు పట్నంలో పనార్లు చేయడానికో, షాపింగ్ చేయడానికో వెళ్ళవచ్చు. మిత్రులతో కలిసి వనభోజనాలకైనా వెళ్ళవచ్చు.

రెండేళ్ళ తర్వాత పదమ్ బహదూర్ లాన్స్‌నాయిక్‌గా ప్రమోట్ అయ్యాడు. శ్రేణి


సుబేదార్ బనా సింగ్


లెఫ్ట్. కర్నల్. తారాపోర్


మేజర్ శైతాన్ సింగ్

పద్ధతిలో అది మొదటి మెట్టు. ఎంతో సంతోషించాడతను. రెండు నెలల సెలవు తీసుకుని స్వగ్రామంలో ఇంటికెళ్ళాడు. అక్కడ పెళ్ళి చేసుకోవాలని తల్లిదండ్రులు నచ్చ చెప్పటం ప్రారంభించారు. మొదట అతను వద్దన్నాడు. కాని అప్పటికే వాళ్ళు పెళ్ళి కూతుర్ని ఎంపిక చేశారు, అప్పటికి అతనికింకా ఇరవై రెండేళ్ళ వయసే. అయినప్పటికీ చివరికి ఒప్పుకున్నాడు. వివాహమహోత్సవం ముగిసింది. భార్యను తీసుకుని తన కేంద్రానికి వెళ్ళాడు. అదృష్టంకొద్దీ కంటోన్‌మెంట్‌లో కుటుంబ నివాస గృహాన్ని అతనికి కేటాయించారు. అక్కడ అతనూ, భార్యా కలసి రెండేళ్ళు జీవించారు. తర్వాత మళ్ళీ బెటాలియన్‌ను పర్వతాలలో కొంత విధి నిర్వహణకు పంపారు.

పదమ్ బహదూర్‌లాంటి యువకులు సైన్యంలో వందలు, వేలు వున్నారు. వారు భారత్‌లో అన్ని ప్రాంతాలనుంచి వచ్చారు. కొన్నిసార్లు శాంతికేంద్రాల్లో మరికొన్నిసార్లు సరిహద్దుల్లో, లేదా పర్వతాల్లో మిత్రులతో కలిసి జీవిస్తారు; తర్ఫీదు పొందుతారు— మహత్తర సోదర భావంతో అంతర్భాగంగా వారెంతో గర్విస్తారు; ఆనందిస్తారు.

# మారుతున్న యుద్ధతంత్రం మార్గాలు

సాంకేతిక రంగంలో శాస్త్రపరిశోధనలు, విజయాలవల్ల గత 25 సంవత్సరాలలో అనేక కొత్త రకాల ఆయుధాలు వచ్చిన విషయం మీకు తెలుసు. ప్రతి దశలోనూ ఈ పరిశోధనల గురించి సైన్యం ఆఫీసర్లు, సైనికులు తెలుసుకుంటూ ఉండాలి. వాటి స్వభావాలను అధ్యయనం చేయాలి. కొత్త ఎత్తుగడలు పద్ధతులు రూపొందించాలి. అందుకే సైన్యంలో జీవనం నిరాసక్తంగా వుండటం అరుదు. ప్రయోగం చేయడానికి ఎప్పుడూ ఏదో ఒక కొత్తదనం ఉంటుంది. ఈనాడు మనం పూర్తిగా భిన్నమైన రెండు రకాల యుద్ధాలకు సన్నద్ధమై వుండాలి. అమెరికా తదితర అభివృద్ధి చెందిన పశ్చిమ దేశాలనుంచి ఆధునికమైన టాంకులు, విమానాలతో కుత్తుక బంటి ఆయుధాలుగల పాకిస్తాన్‌ను పశ్చిమాన మనం ఎదుర్కొన్నాం. యాంత్రీకృత యుద్ధంలో పోరాటానికి మన సేనలు తర్ఫీదు పొందవలసి వచ్చింది. ఇలాంటి యుద్ధంలో టాంకులు భారీ శతఘ్నులు ముఖ్య పాత్ర వహిస్తాయి. ఎందుకంటే అది అమిత వేగంతో ప్రచండంగా సాగే యుద్ధం కావచ్చు. వేలకు వేల శతఘ్నిగుళ్ళు ఒకచోటే పేలుతుంటాయి. నేలపైని సేనలపై కాల్పులకు ఆకాశంనుంచి కిందుగా విమానాలు ఎగురుతుంటాయి.

ఇక ఉత్తరాన, మహోన్నత హిమాలయ సరిహద్దున మన సైన్యంలో ఎక్కువ భాగం నియమితమైంది. ఇక్కడ యుద్ధం పూర్తిగా భిన్నమైంది. ఇక్కడ ఇరవై అడుగులు, ఇంకా ఎత్తున వున్న శిఖరాలవద్ద సేనలు పోరాడాల్సి వుంటుంది. ఈ యుద్ధానికి తక్కువ ఉధృతి, మందకొడి గమనం ఉంటుంది. అక్కడ వారు ఉపయోగించే ప్రతి ఒక్కటీ— మందుగుండూ, ఆహారం, దుస్తులూ—అన్నీ అత్యంత క్లిష్టమైన మార్గంలో పంపాలి.

ఈ ప్రయాణం వారాల తరబడి సాగవచ్చు. కదలికలు కష్టం. ఎందుకంటే ఈ శిఖరాల్లో గాలి బహు తక్కువ. కొన్ని చోట్ల కేవలం బతికి ఉండేందుకే ఆక్సిజన్ తీసుకెళ్ళాల్సి వస్తుంది. అందుకని ఈ శిఖరాలపై అన్నీ అపురూపమే. వృథా అయ్యే పక్షంలో మందుగుండును తొందరపడి వాడేయకూడదు. పంజాబ్ మైదానాలలో దీనికి భిన్నమైన పద్ధతి, భిన్నమైన దృక్పథం అవసరం.

అదృష్టవశాత్తూ సాయుధ దళాల్లో మనకు చాలా చక్కని పారిశ్రామిక, శాస్త్ర పరిశోధన పునాది వుంది. ఆ విషయంలో మనది చాలా అభివృద్ధి చెందిన దేశం. ఎందుకంటే అనేక ఇతర సైన్యాల మాదిరికాక (చివరికి అనేక పశ్చిమ దేశాల సైన్యాలు కూడా) మన సొంత అవసరాలలో అత్యధిక భాగాన్ని మనమే ఉత్పత్తి చేసుకోగలిగాం. మన సైన్యాల అవసరాన్ని మన రక్షణపరిశ్రమలు తీరుస్తాయి. అలా మన సైన్యం ఆధునికంగా, సమర్థవంతంగా ఉండేందుకు సాయపడతాయి.

# శాంతి కాలంలో సైన్యం

చాలా ఏళ్ళనాటి మాట. కాశ్మీర్‌లో నా బెటాలియన్‌తో వున్న ఒక సందర్భం నాకు గుర్తు. అది వసంతం. లోయనిండా యాత్రికులే. శ్రమతో కూడిన శిక్షణానంతరం మా బెటాలియన్ విశ్రాంతి తీసుకుంటోంది. ఒక రోజు శ్రీనగర్‌నుంచి ఓ విజ్ఞప్తి వచ్చింది. దేశమంతటినుంచీ వచ్చిన పాఠశాల బాలల బృందం మా బెటాలియన్‌ను సందర్శించడానికి అనుమతికోరారు. వాళ్ళేమీ ఇబ్బంది పెట్టబోరని మాకు హామీ ఇచ్చారు. కేవలం సైన్యాన్ని చూడాలనుకుంటున్నారని చెప్పారు.

పిల్లలు వచ్చారు, వెంట చాలామంది టీచర్లున్నారు. అంతా చాలా క్రమశిక్షణతో, పద్ధతి ప్రకారం, దాదాపు ప్రశాంతంగా వున్నారు. బాలబాలికలంతా బుద్ధిగా మెలగాలనీ, వస్తువులేవీ ముట్టుకోవద్దనీ, గోలచేయొద్దనీ ఉపాధ్యాయులు చెప్పారు. నిజానికి వాళ్ళంతా నీరసంగా వున్నారు. మమ్మల్ని చూసి బెదిరిపోయినట్టున్నారు. అందుకని ఉపాధ్యాయులందర్నీ మా ఆఫీసర్స్ మెస్ కాఫీ తాగేందుకు ఆహ్వానించాం. మెస్‌లో కూర్చున్న ఉపాధ్యాయులందరూ బెంగపడ్డారు. పిల్లలంతా సజావుగా వున్నారా? అల్లరి లేదుగదా? మరేం బెంగవద్దని వాళ్ళకు చెప్పాం.

గంట తర్వాత మేం బయటికొచ్చేసరికి దృశ్యం మారిపోయింది. సైనికులతో బాలల్ని చూశాం. కొందరు జీపులలో వెళుతున్నారు, కొందరు కందకాల తవ్వకంలో సాయంచేస్తున్నారు. మరికొందరు వంటగదిలో జవాన్‌ల భోజనం రుచి చూస్తున్నారు. వాళ్ళందరూ జవాన్‌ల స్నేహితులయిపోయారు. పిట్టల్లా ఆనందంగా వున్నారు.

తర్వాత ఆరోజు పిల్లలెంత ఆనందించారో, మావాళ్ళూ అంతే సంతోషించారని

నాకు తెలిసింది.

భారతసైన్యం ఈనాడు జాతి జీవన ప్రధాన ప్రవాహంలో అంతర్భాగమయింది. బ్రిటిష్ రోజులలో అలా కాదు. సాధారణ ప్రజలతో సంబంధాలు లేకుండా దూరంగా వుంచేవారు. ఈనాడు యూనిఫామ్‌లోని సైనికుణ్ణి మన నగరాల్లో నిత్యం చూడవచ్చు. బస్సులలోనో, బజారులోనే, బహుశా తన కుటుంబంతో షాపింగ్ చేస్తూండగానో వారిని మీరు చూడవచ్చు. గ్రామాల్లో కూడా అతను సుపరిచితుడే. వరదలు, కరువులు, అగ్ని ప్రమాదాలు, భూకంపాలు వంటి ప్రకృతి వైపరీత్యాల తరుణంలో గ్రామస్తులకు



వరద బాధిత ప్రజలకు సహాయం చేస్తున్న ఆర్మీ జవాన్ల బృందం

సాయం చేసేందుకు ఎప్పుడూ అతను వెళుతూనే వుంటాడు.

సైన్యం ఇంజనీర్లకు అత్యంత ఆధునిక పరికరాలుంటాయి. అవి పౌరులకు లభించవు. ఉదాహరణకి అటు నేలమీదా ఇటు నీటిలోనూ ప్రయాణించే పడవలు మాకు వున్నాయి. వాటిని మేము 'బాతు'లంటాం. 1976లో యు.పి., బీహార్, ఒరిస్సాలను ముంచెత్తిన వినాశకరమైన వరద లొచ్చాయి. అప్పుడు ఆ ప్రాంతాలకు సైన్యం 'బాతు' లెన్నిటినో పంపారు. అన్నీ మునిగి, ఇళ్ళకప్పులు, చెట్లకొమ్మలపైనున్న గ్రామస్తులను అవి రక్షించాయి. వరద నీటి వలయం మధ్య చిక్కుకున్న గ్రామాలకు అవి ఆహారం



అందించాయి. వేరుపడిన ప్రాంతాలలో అత్యవసరమైన కేసులకోసరం ఎందరో వైద్యులను తీసుకు వెళ్ళాయి. వంతెనలు కొట్టుకుపోయినప్పుడు సైన్యం తమవద్దగల పేరుమోసిన బెయిలీ బ్రిడ్జి పరిసరాలతో వాటిని త్వరగా నిర్మిస్తుంది.

దుర్భిక్షం, కరువు కాలాల్లో సైన్యం, ఇంజనీర్లు, గొట్టపు బావులు త్రవ్వుతారు. నీటి పంపకం కోసరం జలకేంద్రాల నిర్మాణానికి సాయపడతారు. ప్రత్యేకంగా మెట్ట ప్రాంతాలకు నీరును తీసుకువెళ్ళే కాల్వలనుకూడా నిర్మిస్తారు. చివరికి ముఖ్యమైన పండుగల సమయంలో కూడా సైన్యం ఎన్నో విధాల సాయపడుతుంది. ఉదాహరణకు 1998లో హరిద్వార్‌వద్ద కుంభమేళా జరిగింది. గంగాస్నానం కోసరం లక్షోపలక్షల ప్రజలు ఆ



ఆర్మోర్డ్ పర్సనల్ కారియర్

చిన్న గ్రామానికి వెళ్ళారు. అప్పుడాగంగానది కాల్వలపై కాలినడక వంతెనల నిర్మాణానికీ, ఆహారం పంచడానికీ, శుభ్రమైన నీరిచ్చేందుకూ, యాత్రికులకు వైద్యకేంద్రాలు ఏర్పరిచేందుకు, ఇంకా ఎన్నో విధుల నిర్వహణకు వేలాది సైన్యాన్ని నియమించారు.

తీవ్రమైన సందర్భాలలో దేశాన శాంతిభద్రతలు నెలకొల్పేందుకు సైన్యం సాయపడుతుంది. ఈ కర్తవ్యాన్ని 'ఆంతరంగిక భద్రత' అంటారు. అయితే దీనికి పోలీసులను వినియోగించడమనేది సాధారణ పద్ధతి. కానీ పెద్ద కల్లోలంవస్తే దాన్ని నెమ్మదించేందుకు పౌర అధికార్లు సైన్యాన్ని పిలుస్తారు.

కాశ్మీర్, యు.పి., హిమాలయాలు, అరుణాచల్ ప్రదేశ్, నాగాలాండ్, మిజోరం వంటి సరిహద్దు ప్రాంతాలలోని విస్తృత భాగాలలో వేలాది మైళ్ళ పొడవుగల రోడ్లు నిర్మించే బాధ్యత సైన్యానికి వుంది. వాటిని నిర్మించే సంస్థను సరిహద్దు మార్గాల సంస్థ అంటారు. దీనిలో త్రివిధ దళాలకు చెందిన సైనికులుంటారు. నూతనంగా ఆవిర్భవించిన ప్రాంతాల అభివృద్ధికి వారు రోడ్లు నిర్మిస్తారు. కొన్ని సందర్భాల్లో 16,000 అడుగుల ఎత్తునా, ఆపైనావున్న కనుమలపై రోడ్లు నిర్మించారు. ఇవి ప్రపంచంలోకల్లా ఎత్తయిన వాటిలో కొన్ని. మన సరిహద్దు ప్రాంతాల్లో నివసించే గిరిజన తదితర ప్రజానీకానికి ఇదెంతో ప్రయోజనం చేకూర్చింది.

ఈ కార్యకలాపాలన్నిటివల్లా, నాలుగు పెద్ద యుద్ధాలూ, అనేక చిన్న యుద్ధాలలో వీరోచితపాత్ర వహించినందువల్లా భారతీయ జవాన్ నేడెంతో ప్రాచుర్యం గలవాడయ్యాడు. అతనొక క్రమ శిక్షణగల వ్యక్తి. కష్టకాలంలో ఎప్పుడూ ఆదుకుంటాడు. నిజమే-అతని శిక్షణా, అతని సంప్రదాయం అతనికి నేర్పినది అదే.



గూర్ఖా రైఫిల్స్ మార్చిపాస్ట్ దళం

